# భారతీయ ప్రతిభ

రచయిత
గౌ. శ్రీ కల్లూరి చంద్రమౌళి, బి. యస్‌సి. (ఎబర్డీన్)
స్థానిక శాఖామాత్యులు - మద్రాసు రాష్ట్రము

తొలిపలుకు
గౌ. శ్రీ పాకాల వెంకట రాజమన్నారు
ప్రధాన న్యాయమూర్తులు, హైకోర్టు - మదరాసు

సంపాదకుడు
ఉభయభాషాప్రవీణ
పం. వడ్లమూడి వెంకటరత్నము
'సందేశమాల'

ప్రథమ ముద్రణము : విరోధి - సంక్రాంతి - ౧౯౫౦
ద్వితీయ ముద్రణము : వికృతి - గ్రీష్మము - ౧౯౫౦
తృతీయ ముద్రణము : ఖర - ,, - ౧౯౫౧

వెల : రెండు రూపాయలు

ప్రచురణ
సందేశమాల - తెనాలి

# తొలి పలుకు

మనకు స్వాతంత్ర్యము లభించినది మొదలు మన బాధ్యతలు హెచ్చినవి. సమస్యలు పెరిగినవి. సంఘర్షణ ఎక్కువైనది. ధనము నార్జించుటకన్న ఆర్జించిన ధనమును కాపాడి, వృద్ధిచేసి, సద్వినియోగము చేయుట ఎట్లు కష్టతరమో అట్లే స్వాతంత్ర్య విషయమున గూడ. ఈ స్వాతంత్ర్యమును సార్థక మొనర్చి భారతదేశ వైభవమును స్థాపించి, వికసింపజేయుటకు ముఖ్యముగ నావశ్యకములు మూడు:

భారతీయ ప్రతిభయందు గౌరవము, విశ్వాసము ఒకటి.

భారతీయ సంస్కృతి పోషణ రెండు.

భారత సందేశ వ్యాప్తి మూడు.

భారతీయ ప్రతిభ, భారతీయ సంస్కృతి, భారతదేశ సందేశము– అని ఊతపదములుగ నుపయోగించుట అలవాటైపోయినది గాని వాని నిజస్వరూపము తెలిసినవారు అనేకులు లేరు. ఈ లోపమునకు ముఖ్యకారణము ఈ విషయములను గురించి ఇంగ్లీషుభాషలో ఏవోకొన్ని గ్రంథములు తప్ప దేశభాషలలోయెక్కువగా గ్రంథములు లేకపోవుటే. ఈ కొరత దీర్చుటకు శ్రీ చంద్రమౌళిగారు ఈ పుస్తకమును తెలుగున రచించి నందులకు వందనీయులు. ఇట్టి గ్రంథము తెలుగున వేరొండు లేదను కొందును.

వీరు అనుసరించిన పద్ధతిలో మిక్కిలి కొనియాడదగిన యంశము ఒకటి చెప్పక తప్పదు. ప్రతి విషయమును గురించి ఆంగ్లమున ప్రఖ్యాత విద్వాంసులు రచించిన గ్రంథములనుండియు, ఇతర పురాతన రచయితల గ్రంథముల నుండియు విపులముగ నాధారముల నేర్చి కూర్చినారు.

శైలి మృదు మధురము. విషయము ఉత్కృష్టము. పద్ధతి నవీనము. ఇంత మంచి గ్రంథమును ఆంధ్రలోకమునకు సమర్పించిన శ్రీ చంద్రమౌళి గారు స్థాన మాత్రముననే గాక నిజముగ గౌరవనీయులు. ఈ తొలి పలుకు వారికి నా యభివందనము.

మద్రాసు, 5-1-50 (సం.) పా. వెం. రాజమన్నారు

సకల భౌతికసంపదలతో, సంస్కృతీ వైభవముతో, ఆధ్యాత్మిక తేజస్సుతో ఖండ ఖండాంతరముల విఖ్యాతిని బడసిన ప్రాచీన భారత తేజస్సును నేటి భారతీయ యువకులే విస్పష్టముగ గ్రహింపలేకుండుట శోచనీయము. గ్రహించినవారును దాని నాదరించి యనుసరింపకుండుట విచారకరము. ప్రాచీన వైభవము నేకరువుపెట్టి దానినెల్ల గుడ్డితనముగ స్వీకరింప వలయునని గానీ, నవీన ప్రాభవమునెల్ల నాశ మొనర్ప వలయు నని గానీ మామతము గాదు. ప్రాచీన రత్నములను నవీన విజ్ఞానముతో సానబట్టి భావ్యున్నతికి బలిష్ఠమైన పునాదుల వేయ ప్రబోధించుటయే మా యభిమతము.

అనంత సత్యములు ఆర్యసాంప్రదాయములు వాంఛనీయములు. పైపై వన్నెలకు భ్రమసి పాశ్చాత్య వ్యామోహమునకు లోనైన భారతీయ యువకులను ప్రాక్పశ్చిమ ధర్మములను బరిశీలించి, సమన్వయించి, దాని ననుసరించి తమ జీవితములను చక్కదిద్దుకొనుడని హెచ్చరించుచున్నాను.

పాశ్చాత్యులను గూర్చి వారి పెద్దలు చెప్పిన మాటలను, భావములనే యిందుదాహరించితిమి. వారిని తృణీకరింపవలయు ననిగానీ, మనము స్వీకరింప దగిన గుణము వారియందు లేదనిగానీ పలుకుట మా వాదము. ప్రాచీన భారత ధర్మము లాధారముగ నవీన విజ్ఞానమును సేకరించుటయు, ప్రాక్పశ్చిమ ధర్మ సమ్మేళనముతో భావిభారతాభివృద్ధికి పాటుపడుటయు సమంజసము. ఈ భావములు ఏకొందరలో నైన రేకెత్తింపగల్గినచో ఈ గ్రంథ రచనోద్దేశము సఫలమగును.

కోరినంతనే తొలిపలుకు వ్రాసియిచ్చిన ప్రధాన న్యాయమూర్తులు గౌ. శ్రీ రాజమన్నారుగారికి ధన్యవాదములు.

స్వాతంత్ర్య సంగ్రామావసరముల నప్పుడప్పుడు కారాగారముల నుండి నా వ్రాసిన వ్యాసములను ఈ గ్రంథ రూపమున సంతరించిన మిత్రులు "సందేశమాలా" సంపాదకులు శ్రీ పం. వడ్లమూడి వెంకట రత్నముగారికి కృతజ్ఞుడను.

విజ్ఞాన స్వరూపులు, విశ్వకళా పరిషన్నేతలు నయి తమ యమూల్యాభిప్రాయములతో నాదరించిన విమర్శకాగ్రగణ్యులు, గురుస్థానీయు లయిన శ్రీ కట్టమంచి రామలింగా రెడ్డిగారికిని మిత్రరత్నముగు డాక్టరు వి. శ్రీకృష్ణగారికిని అభివాదనములు.

— రచయిత

# కృతజ్ఞత

స్వాతంత్ర్య సమరాంగణములందు సత్యాగ్రహము సలుపునప్పుడును, కారాగారములందు కడగండ్లబడునప్పుడును, రాష్ట్రపరిపాలనా కార్యములందు ప్రధాన పదవులనుండి భారము వహించునప్పుడును భారతీయ సంస్కృతిని గ్రహించుటకై, అనుసరించుటకై, వ్యాప్తియొనర్చుటకై ప్రయత్నించు ప్రాజ్ఞులు గౌ. శ్రీ చంద్రమౌళిగారు.

ఇట్టి వీరి గ్రంథరత్నమును - ప్రాచీన భారత సంస్కృతికి పరిశుభ్రమగు నద్దమువంటిదానిని - సర్వస్వామ్యములతో సంతరించుట 'సందేశమాల'కు పరమసంతోషము.

ఈ యవకాశము మాకు గల్పించిన శ్రీ చంద్రమౌళిగారి సౌహార్దమునకు శ్రద్ధాంజలులు.

బాల్యమునుండియు కళారాధనమున ప్రజ్ఞావంతులై, ధర్మసూక్ష్మనిర్ణయమున దత్పరులయ్యు భాషా దేవతారాధనమునకు బరువులెత్తు భక్తాగ్రగణ్యులు గౌ. శ్రీ రాజమన్నారుగారు.

కార్యభారమున తీరిక లేక యుండియు తమ 'తొలిపలుకు'తో నీ గ్రంథ సువర్ణమునకు దావి గల్పించిన శ్రీ రాజమన్నారుగారి సహృదయతకు సంస్తుతులు.

అత్యల్పకాలముననే యీ గ్రంథమునకు తృతీయ ముద్రణావసరము గల్పించిన యాంధ్ర మహాజనుల యౌచిత్య సంపదకు సాధువాదములు.

— సంపాదకుడు—'సందేశమాల'

# ప్రముఖుల అభిప్రాయములు

## (1)

## UNIVERSITY OF MYSORE

C. R. REDDY
*Pro-Chancellor*

West lake
Yelwal Road
MYSORE,
21 st April, 1950

*My Dear Chandramouli,*

I am so sorry I have delayed acknowledging receipt of your book 'భారతీయ ప్రతిభ' and responding to your kind letter sent along with it.

I must congratulate you on this excellent little book and even more on the fine mastery of Telugu prose – a very difficult art – which you have displayed. I like it in every way; for its inspiring subject matter; the attraction of your style; its scholarship without pendantry; and patriotic impulse and fervour.

I specially commend the fact that you have avoided the bizarre and vulgar గ్రామ్య భాష. and kept to the classical, which will be understood and appreciated for all time to come and in all parts of the Andhra Desa.

With my sincere congratulations and the hope that you will write many more books in our lovely Telugu,

I remain,
*Yours sincerely,*
(Sd.) C. R. REDDY.

(2)

## ANDHRA UNIVERSITY, WALTAIR

Dr. V. S. KRISHNA, 23-2-1950
*Vice-Chancellor*

భారత దేశము సర్వ విషయములను స్వాతంత్ర్యమును బొంది పరిపూర్ణాభ్యుదయమును గాంచవలసిన యీ కాలమున, భారతీయ నాగరికతయొక్క స్వరూప స్వభావములను భారతీయులెల్లరును తప్పక గుర్తింపవలయును. ఆత్మ గౌరవముగల ప్రతి వ్యక్తియు తన జాతి యందలి ప్రతిభను తెలిసికొనిన గాని యా గౌరవము సార్థకమును సవిశ్వాసమును గాజాలదు. ఈ విషయమున శ్రీ చంద్రమౌళిగారి గ్రంథము ఆంధ్రలోకమున కెంతయు నుపయోగించునని చెప్పక తప్పదు. భారత నాగరికతలోని యనేక విషయములు 'భారతీయ ప్రతిభ' యను వీరి గ్రంథమున చక్కగా వివరింపబడినవి. ప్రాచ్య పాశ్చాత్య విమర్శకుల యభిప్రాయములను సోదాహరణముగా క్రోడీకరించుచు, నవ్యమును భవ్యమును నైన విధమున నీ గ్రంథము వ్రాయబడినది.

శైలి సులభమై సలక్షణమైన భాషతో గూడియున్నది.
దీని నాంధ్రులెల్లరును జదివి యానందింతురుగాక.

23-2-1950 (Sd.) V. S. KRISHNA,
*Vice-Chancellor*

(3)

## డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు

*President:*

All India Congress Committee, New Delhi.

మానవ స్వభావము చిన్నచిన్న రూపములు డాల్చుట మన మెరుగుదుము. కొందరు వెనుకకుచూచి విస్మయము పొందువారుగను, మరి కొందరు ముందుకుచూచి ముచ్చటపడువారుగను, వేరు కొందరు అడుగడుగుకు ఆగుచు అనుమానించువారుగ నుందురు. ఇట్లు భూత భవిష్యత్ వర్తమానము యెడల వీరికిగల భక్తి విశ్వాసములే వీరి స్వభావములను నిర్ణయించును. కాని మాటిని గురించి భూతకాలమనెడి నిర్గమస్థలమునుండి వర్తమానమనెడి ఆరామప్రదేశముద్వారా భవిష్యత్తనెడి గమ్యస్థానము చేరెడివారేధన్యులు. నిరంతరము పూర్వకాలచింతలోనిమగ్నులైన వారు ఛాందసులు, పూర్వాపర సమన్వయము చేయజాలకుందురు. కేవలం వర్తమానమునందలి ప్రవృత్తులతో కాలముగడుపువారు పునాదిలేని ఇల్లువలె ఋతువు మారినపుడు కృంగిపోవుదురు. కేవలం భవిష్యత్తుమీద మనస్సును లగ్నము చేసికొనువారు గాలికి కొట్టుకొనిపోవు ఆకువలె స్వాధీనము తప్పిఉందురు. ఇట్లుగాక భూతకాలమునుండి ఆరంభమైన మహాప్రస్థానమును వర్తమానమనెడి మార్గముద్వారా భవిష్యత్తనెడి గమ్యస్థానము జేరువారే ధన్యులు.

ఇట్లే ధన్యతకు తోడ్పడుమార్గములు, సాధనములు, ఈ పుస్తకమునందు మదరాసు రాజధాని అమాత్యవరులు అగు శ్రీ చంద్రమౌళిగారిచే విస్తరింపబడినవి.

భారతీయ ప్రతిభ ఈ నాటిదికాదు. ఎప్పుడు ఆరంభించెనో, ఎట్లు విజృంభించెనో, ఎవ్విధముగ ప్రజ్వలింపనైయున్నదో ఒక వ్యక్తికి గోచరమగు విషయముకాదు. కాని చంద్రమౌళిగారివంటి బుద్ధిమంతులు, శేముషీధురంధరులు సనాతన ఆధునిక సందర్భములను సమన్వయము చేయగల సమర్థులు. భారత దేశముయొక్క నైసర్గిక స్వరూపమును

గుర్తించి ఏకదేశము అని బుజువుచేసి ప్రకృతి రహస్యములను వెల్లడి పఱచి, నిత్యజీవిత విధానమును వర్ణించి దేశముయొక్క నాగరికత, లలిత కళలు - సంస్కృతులను వ్యక్తీకరించి హిందూసంఘమునందు స్త్రీ కెట్టి అమోఘమగు స్థాన మొసంగబడెనో నిరూపించి భరతదేశముయొక్క అమూల్య సందేశమును ఈ గ్రంథముద్వారా ఆంధ్రులకు అందజేసిన అమాత్యవరులకు మన కృతజ్ఞత తెలుపవలసి యున్నది. పుస్తకములో వెల్లడింపబడిన ప్రతి అభిప్రాయమునకు మూలాధారము చూపింపబడుటచే చదువరులకు మిక్కిలి తృప్తికరముగను, విశ్వాసజనకముగను, నచ్చుచున్నవి. రమ్యమైన శైలిలోను, ప్రౌఢమగు భావములోను లిఖింపబడిన ఈచిన్ని పొత్తమును చదువ ప్రారంభింపగనే ఆసాంతమువరకు చదువవలెనను కుతూహలము గలుగుచున్నది. ఈగ్రంథమును ప్రచురించి శ్రీ చంద్రమౌళిగారు ఆంధ్రదేశముయొక్క కృతజ్ఞతకు పాత్రులగుచున్నారు.

(సం.) భో. పట్టాభి సీతారామయ్య

---

( 4 )

కళాప్రపూర్ణ, కావ్యస్మృతితీర్థ
జనమంచి శేషాద్రిశర్మ

"శ్రీ లలితా విలాసము"
కడప, 19-2-1950

శ్రీః

# భారతీయ ప్రతిభ

..................................................గ్రంథము నామముచేతనే విషయమును వెల్లడించుచున్నది. ఇందుఁ బ్రాచ్యపాశ్చాత్య పండితుల యూహాలు భరతఖండమును గుఱించినవి సేకరింపఁబడి ముద్దులుగుల్కు తెలుఁగు నుడులతో సమన్వయము గావింపఁబడి భారత దేశపు టౌన్నత్యము వెల్లడింపఁబడినది. వర్తమాన ప్రజల కియ్యది హితోపదేశము చేయఁజాలియున్నది. కాలమునుబట్టి నానావిధముల చిందఱ వందఱయగు

చున్న తెలుఁగుభాసను ఆధునికులయ్యును బ్రాచీనసాంప్రదాయములతోఁ గూర్చి సుబోధకముగ విషయములను తెల్పుటకై వీరు ప్రయత్నించుట మెచ్చఁదగియున్నది. ఇందుఁగల పదునొకండు విభాగములు విషయమును బహూపయుక్తముగ, సార్థకముగ, భావింపఁబడినవి. వీరి ప్రాచీన సాంప్రదాయ ప్రియత్వమునకుఁ బరమాహ్లాద మందుచున్నాను. ఇట్టి గ్రంథములు ఇక్కాలమున నరుదుగనున్నవి. ఇట్లే వీరు దేశోపయోగములుగ ననేక గ్రంథరత్నములు రచించి భాషాజనని నలంకరింతురని కోరుచున్నాను. పరమేశ్వరుఁడు వీరికన్ని విషయముల హితము చేకూర్చుఁగాక!

ఇట్లు హితాకాంక్షి,

(సం.) జనమంచి శేషాద్రిశర్మ

---

## ( 5 )

వేటూరి ప్రభాకరశాస్త్రి — తిరుపతి, 17-3-50

ఆర్య ! వందనము.

ఇంకాక అన్నమాచార్యోత్సవాది సంరంభమున నఁగుల పడుచుంటిని. మీ గ్రంథము అనాడే అందినను చదువుట కిప్పటికే సమయము దొరకినది. చదువ నారంభించి కడముట్ట సునాయాసముగా చదివి, తనిసి, యిది వ్రాయుచున్నాను.

చదువుటలో నాకు భావగాని, రచనగాని, ఆశ గొల్పక, అగపడక, విషయసూచిలోని మహోన్నత విషయములే, భారతదేశ వైభవమే పరిస్ఫురించుచు వచ్చినది. అందు వైదేశిక సమ్మతులు స్వరూప సౌందర్యమునకు అద్దమువలె ఎదురనిల్చినవి. అధ్యాయము అధ్యాయము చదువుచు, ఆహా ఆహా అనుకొంటిని. అట్టి దివ్యభారతపు నాగరకత, తాత్త్వికత, శీలము, విజ్ఞానము, శిల్పము, సర్వసంపదలు ఏకరూపమై ప్రసవించిన దివ్యఫలము గాంధి మహాత్ముడు! మననాటి వాడు. ఆయన పవిత్ర సందేశమునకు వశులై చొక్కి చిక్కి నవసి కడగండ్లు గుడిచి వన్నెలు చేరి అర్ఘ్యపదములందిన మీ బోంట్లను సదా సంభావించు చుందును.



జైలులోని మీ గ్రంథరచన దివ్యక్షేత్రమున తపస్సు వంటిది. ఈ ముద్రణము వడిగా చెల్లిపోయి, చాల చౌకగా రెండవ ముద్రణమునంది తెలుఁగు నాఁట నంతటను మీ గ్రంథము ప్రచారము గాంచి భారత వైభవము నందఱకును కరతలామలకము గావించుగాకని యర్థించుచున్నాను.

ఇట్టి గ్రంథము రచించినందుకు మిమ్ము సంభావించుచున్నాను.

చిత్తగింపుడు,

(సం.) వే. ప్రభాకరశాస్త్రి

---

## ( 6 )

జి. జాషువకవి — గుంటూరు, బుచ్చయ్యతోట

తేది 18-2-50

గౌరవనీయులైన కల్లూరి చంద్రమౌళి మంత్రి మణులకు—

నమస్కార సహస్రాలు.

తమ భారతీయప్రతిభ అను గ్రంథరాజాన్నందుకొని శ్రద్ధతో ప్రత్యక్షరాన్ని చదివి ఆనందభరితుణ్ణయ్యాను. ఉభయఖండాల నాగరికతా విజ్ఞాన ప్రతిభావిశేషాల్ని త్రాసులోనుంచి తూచి, తారతమ్యాల్ని నిర్ణయంచేసే అధికారం ఖండాంతర మహాయాత్ర చేసిన తమకుతప్ప అన్యులకు లేదు. పాశ్చాత్య వ్యామోహాతిరేకంచేత స్వీయదేశ స్థిరగౌరవాన్ని నిరాదరించువారైన అధునాతన భారతీయునికి మీ గ్రంథం దర్పణంవంటిదనడాని కెట్టి సందియంలేదు. భారతప్రతిభ కాశ్చర్య చకితులైన విదేశీయుల ప్రశంసాపరంపరల్ని అనేకాలను సేకరించిన మీ బహుగ్రంథపరిచయ సంపత్తి సర్వతోముఖ పాండిత్యం స్తవనీయం. మనసంస్కృతిలో మన విజ్ఞానంలో మన కళాదృష్టిలో మన పారమార్థికచింతలో నిగూఢమై సామాన్యదృష్టికి గోచరించని నగ్నసత్యాన్ని నిష్పాక్షిక దృష్టితో విమర్శించి బహిర్గతంచేసిన మీరచనాచండిమకు ధన్యవాదాలు. ఒక రాజకీయరంగంలోనేకాక తమకు సాహిత్యరంగంలో కూడా కూలంకష

పాండిత్యం కలదని మీ గ్రంథరాజం అక్షరవదన యై చాటి చెప్తూనే యుంది. భాష తీయనిది, భావాలు నవ్యాలు, శైలి నవనవోన్మేషమైంది. మీ గ్రంథం ప్రతి భారతీయుని కవశ్య పఠనీయమనడాని కెట్టి సందేహం లేదు. బాపూజీ పథానుచరులైన తమరి జిహ్వాపల్లవం ఇట్టి దివ్య పుష్పాలను కుసుమించడంలో వింతలేదు. మీ కిదే ప్రణయాంజలి.

విధేయుడు,

(సం.) జి. జాషువ

( 7 )

## ఆంధ్రపత్రిక

### 19-2-1950 ఆదివారము

..................................... వెనుక దేశోద్ధారక శ్రీ॥ శ్రీ॥ నాగేశ్వరరావు పంతులుగారన్నట్లుగా "జాతీయ పునర్నిర్మాణ కార్యక్రమ మను దానిని దేనిని చేబట్టవలసి యున్నను, ముందు, మనకుగల ప్రాచీన సంస్కృతియెట్టిదియో సమగ్రముగ గ్రహింపవలసి యున్నది." భారత దేశమునకు స్వాతంత్ర్యము లభించి, సర్వతోముఖమైన పునర్నిర్మాణ కార్యక్రమము ప్రారంభము కానున్న యీతరుణములో మనము అనుసరింప వలసిన దృక్పథమును నిర్ణీతము చేయుచున్న ఈమహా గ్రంథము వెలువడుట యదృష్టము. మన జాతికిగల సహజమైన చైతన్యమును దిగద్రావి, అనర్థదాయకముగను, గుడ్డిచూపుగాను, మనము పాశ్చాత్యపద్ధతిని పునర్నిర్మాణ కార్యక్రమమునకు పూనుకొనకుండ, ఈ గ్రంథము ఒక హెచ్చరికగానున్నది.

మహాత్ముని ఆదేశములను జీర్ణించుకొని జాతీయ స్వాతంత్ర్య సమరమున పెక్కు త్యాగములొనర్చిన శ్రీచంద్రమౌళిగారి జాతీయ హృదయమునకు ఇది దర్పణముగా నున్నది.

ఈ వ్యాసములన్నియు, 'స్వాతంత్ర్య సమరావసరముల నప్పుడప్పుడు కారాగారముల నుండి' తాము వ్రాసియున్నామని శ్రీ చంద్ర

మాలికగారే పీఠికలో తెలుపుచున్నారు. వీని నన్నింటినీ సంతరించినవారు 'సందేశమాలా' సంపాదకులు శ్రీ పం. వడ్లమూడి వెంకటరత్నముగారు.

ఇందు: భారతదేశ నైసర్గిక స్వరూపము; భారతము ఏకదేశమే; భారతీయ ప్రకృతి రహస్యము; భారతీయుల నిత్యజీవిత విధానము; నాగరికత యననేమి; లలితకళలు-స్వదేశ మతము; భారతీయ సంస్కృతి; సంస్కృతిదాత; స్త్రీలు; త్రివేణీ సంగమము; భారతదేశ సందేశము— అను అధ్యాయము లున్నవి.

భారత ప్రాచీన సంస్కృతిని కించపరుచుటకుగాను, ఆంగ్ల రచయితలు చేసిన దుష్ప్రచారముల కన్నిటికీ ఈగ్రంథము గొడ్డలిపెట్టు. 'భారతము ఏక దేశ మే' అను నధ్యాయము జిన్నాగారి 'పాకిస్తాన్ వాదము' లోని అసంగతత్వమునంతయూ బట్టబయలు జేయుచున్నది.

నేడు ప్రపంచమంతయూ యుద్ధోన్మాదముతో అట్టుడికి పోవుచున్నది. ఈ కల్లోల ప్రపంచమును సర్వనాశము నుండి సముద్ధరించి ప్రపంచశాంతిని స్థాపించుటకు భారతదేశము ప్రపంచమున కందజేయగల మహాసందేశమును, రచయిత "భారత సందేశము" అను కట్టకడపటి అధ్యాయమున వివరించియున్నారు.

జాతీయ పునర్నిర్మాణ బాధ్యతవహింపనున్న అధికారులుసర్వులూ యీగ్రంథమును తప్పక చదువవలసి యున్నది.

భారతీయ విద్యార్థుల కందరకూ జాతీయప్రతిభా ప్రభావములలో భక్తివిశ్వాసములు రేకెత్తించుటకు ఈ గ్రంథమును పాఠ్యగ్రంథముగా తప్పక చదివించవలసి యున్నది.

మెత్తని సరళ గ్రాంథికములో ఇందలి వచన రచన హాయిగొలుపునదిగా నున్నది.

ఈ గ్రంథమును ఇంత 'మనోహరముగాముద్రించి' ముగ్ధులు మూటగట్టునట్లు తయారు చేయగలిగినందుకు —సంపాదకులు చెప్పినట్లు— నిజముగా ముద్రాపకులు అభినందనీయులు.

ప్రాచీన భారతకళా సంస్కృతులకు చిహ్నములైన నటరాజ గౌతమబుద్ధాది చిత్రముల సంపుటీకరణముగల త్రివర్ణ ముఖచిత్రముతో గ్రంథము చూడ ముచ్చటగా నున్నది.

జాతీయ కళావైదగ్ధ్యమును ప్రదర్శింపగల కొన్ని చిత్రపటము లను సహితము యిందుచేర్చిన మరింత సొగసుగా నుండెడిది. ద్వితీయ ముద్రణమునందు తప్పక ఆ లోటును తీర్చగలరని ఆశించుచున్నాము.

ఇట్టి మహత్తరమైన గ్రంథమును ఆంధ్రమహాజనుల కందజేయ గలిగిన శ్రీ చంద్రమౌళిగారు అభినందనీయులు.

## ( 8 )

## ఆంధ్ర ప్రభ

**18-3-1950,** ఆదివారము

"సకల భౌతిక సంపదలతో, సంస్కృతీ వైభవముతో, ఆధ్యాత్మిక తేజస్సుతో ఖండఖండాంతరముల విఖ్యాతినిబడసిన ప్రాచీన భారత తేజస్సును నేటి భారతీయ యువకులే విస్పష్టముగా గ్రహింపలేకుండుట శోచనీయము. ప్రాచీన భారత ధర్మము లాధారముగా, నవీన విజ్ఞానమును సేకరించి ప్రాక్పశ్చిమధర్మ సమ్మేళనముతో భావి భారతాభివృద్ధికి పాటుపడేటట్లు పురికొల్పడమే నా ఆశయం." - ఈ సత్సంకల్పంతో ఆమాత్యవరులైన శ్రీ చంద్రమౌళిగారు అప్పుడప్పుడు వ్రాస్తూవచ్చిన వ్యాసాల సంకలన మిది. స్వాతంత్ర్య సమర కాలంలో కారాగార వాసం చేస్తూ ఆయన ఈ సారస్వతసృష్టి చేశారు. 'సందేశమాల' సంపాదకులైన వడ్లమూడి వెంకటరత్నంగారు ఈ వ్యాస పుష్ప లన్నిటినీ ఏరి కూర్చేటప్పటికి అదొక చక్కని మాలగా తయారయింది.

అనాదినుంచీ అనంతంవరకు పరివ్యాప్తమైనదని, భారతీయ సంస్కృతి ప్రసిద్ధి చెందింది. అమూలాగ్రం దానిని పారజూచి, దానిపై వివరణ చెయ్యడం, వ్యాఖ్యానించడం పైకి కన్పించేటంత సులువైన పని కాదు. శ్రీ చంద్రమౌళిగారు ఈక్లిష్టకార్యానికే పూనుకొన్నారు. కాని,

అనుక్షణం రాజకీయాలలో మునిగితేలుతూ, స్వరాజ్యసమరంలో యోద్ధ వలె జీవితం సాగించిన వ్యక్తిగా మాత్రమే శ్రీ చంద్రమౌళిగారిని ఎరుగున్నవారికి, గ్రంథం ఆసాంతం చదివేసరికి హర్ష విస్మయాలు కలుగక మానవనిపించింది. ప్రాచీన భారతీయ సంస్కృతి ఎన్ని అంతస్తులలో ఎలా వికసించిందో, భారత విజ్ఞాన మహావృక్షం అనంతశాఖోపశాఖలతో ఎలా వర్ధిల్లిందో విశదీకరించడంలో గ్రంథకర్త తన నిశితమైన పరిశీలనాశక్తిని, వివేచనా పటిమను ప్రదర్శించుకొన్నారని చెప్పక తప్పదు. దానికి తోడుగా ఆయన అనుసరించిన మృదుమధురమైనశైలి గ్రంథానికొక ప్రత్యేకతగా సమకూర్చి పెట్టింది. రాజకీయవేత్తఅయిన చంద్రమౌళిగారికి ఈ గ్రంథంవల్ల రచయితలలో పెద్దపీట లభిస్తుందనడానికిసందేహం లేదు. కనుకనే చీఫ్‌జస్టిస్ శ్రీ పాకాల వెంకటరాజమన్నార్‌గారు తొలిపలుకు వ్రాస్తూ, "ఇంత మంచి గ్రంథమును ఆంధ్రలోకమునకు సమర్పించిన శ్రీ చంద్రమౌళిగారు స్థానమాత్రమున నేకాక, నిజముగా గౌరవనీయులని" కొనియాడారు.

అయితే, మన ప్రాచీనచరిత్రను వర్ణించడంలో కొన్ని అత్యుక్తులు దొర్లినాయని చెప్పవలసివున్నది. "ప్రాచీనవైభవము నేకరువు పెట్టి, దానినెల్ల గుడ్డితనముగా స్వీకరింపవలయునని కానీ, నవీన ప్రాభవమునెల్ల నాశమొనర్పవలయునని కాని మా మతముకాదు" అని పీఠికలో చెప్పుకొన్నప్పటికీ మన ప్రాచీన కాలాన్ని గ్రంథకర్త అచ్చమైన స్వర్ణయుగంగానే చిత్రించారు.

మన ప్రాచీనులు అనితర సాధ్యములైన విజ్ఞాన శిఖరాలను అధిరోహించినమాట వాస్తవం. తత్ఫలితంగా ప్రపంచంలో మరేదేశాన్ని పొందని ఒక విశిష్టస్థానాన్ని భారతదేశం పొందినమాటకూడా నిజమే. అదృశ్యమైన ఆత్మసామ్రాజ్యంలో మన ప్రాచీన మహర్షులు పరిశోధనలు సలిపి, "ఆత్మయే బ్రహ్మ" మనే పరమసత్యం ద్వారా దృశ్యాదృశ్యముల సంబంధమును అద్భుతరీతిని వ్యక్తీకరించినందువల్ల చేకూరిన విశిష్టత, ఇది. ఈ ఆత్మసామ్రాజ్య పర్యటనంలో భారతదేశం తక్కిన ప్రపంచ మంతటినీ వెనుక పడవేసింది. అప్పటికీ ఇప్పటికీ, ఎప్పటికీ ఈ విషయంలో భారతదేశమే లోకానికి గురుపీఠం—సందేహం లేదు...............

( 9 )

## The Indian Express

Dated 21-5-1950

BHARATIYA PRATIBHA

Prefaced by a short but subtle foreword by the Hon. Chief Justice P. V. Rajamannar, this modern prose work forms the collection of essays written by the author from time to time when he was in jail during the hottest days of the national struggle for freedom. Today we have to correctly understand and interpret our past greatness; it is therefore at a most opportune moment that Mr. Chandramouli has brought out this work. The book contains 11 chapters beginning with a description of the physical features of India. Indian life, civilisation, fine arts, religion and culture are treated in subsequent chapters. Women in India and India as the mother of Western culture are the subjects of interesting and instructive chapters. The author aptly closes with the message that shanti or peace can be achieved only through India's spiritual culture in this machine-made and film-fed western world which is mad after power and money.

The style of the book is clear and lucid. The author is to be congratulated on this work.

—N. VENKATA RAO.

# వి ష య సూ చి క

ఓం

వందేమాతరం

# భారతదేశము

## నైసర్గిక స్వరూపము

మన భారతదేశము సహజ సౌందర్య శోభితము. ప్రకృతి లక్ష్మీసంపన్నము. ప్రాగ్దక్షిణ పశ్చిమములందు విశాల మహాసముద్రములు వ్యాప్తములై పరివేష్టించి యున్నవి. ఉత్తరదిశయందున్నతోన్నత హిమవత్ పర్వత శ్రేణులు స్వర్గ లక్ష్మితో సరసములాడుచు గంభీరముగ క్రమ్ముకొని యున్నవి. ఇట్టి సముద్ర పర్వతములచే రక్షితమై భారతదేశము స్వాభావికముగ నేక ఖండముగనే ప్రకాశించు చున్నది.

సంతతశైత్య మయమై, సౌందర్యమున కునికియై కాంతి పుంజములతో కళకళలాడు హిమాలయ పర్వతములును, గంగా, యమునా, సింధు, బ్రహ్మపుత్రా, గోదావరీ, కృష్ణా, కావేరి ఆది మహానదీ ప్రవాహములును, ఉన్నత పీఠ భూములును, విశాలతరములగు మైదానములును, సాంద్రారణ్యములును, విపుల ఖనిజసంపదయు, రుచ్య ఫలములును, పరిమళ పుష్పములును, సుగంధద్రవ్యములును గలిగి ప్రపంచమున ప్రఖ్యాతి గాంచిన దీ దేశమే.

దేశరక్షణమునకు హిమాలయములు పెట్టని కోటలు. ఇందలి హిమరాశి సూర్యకిరణముల గిలిగింతలచే దట్టమగు దిట్టతనమును గోలుపోయి పలుచ పలుచనై కరగి కరగి ద్రవీభూతమై జాలువారి సర్వనదులకు జీవనము నొసగి వానిని జీవనదుల నొనరించు చున్నవి. నిర్మల సూర్యరశ్మి షడృతువులందును సముద్ర జలముల గ్రోలి సమయానుకూలముగ వర్షముల నాదరించుచు దేశమును జలసంపన్నము గావించు చుండును.

ఇందలి మూలికలు - ఓషధులు రోగ నిరోధ నివారణములు గావించి ప్రజల యారోగ్యమును గాపాడు చుండును.

ప్రకృతిసౌందర్యము నొకచో నధికముగ గాంచవలయు నన్న హిమాలయ ప్రాంతములే తగిన ప్రదేశములు. ఇవి మన భారతదేశమునకు పెట్టని కోటలు. సౌందర్యముల మూటలు. ఆధ్యాత్మికపు బాటలు. కవికి కవిత్వము, గాయకునకు గానము, దైవోపాసకునకు దివ్యత్వము నొక్కసారి ప్రసాదింపజేయగల సామర్థ్యము గలవి. ఇందలి పర్యటనము కఠినమైనను మార్దవమును, ప్రయాసమైనను విశ్రాంతిని, భయావహమైనను ఆనందమును గలుగజేయుచుండును.

"హిమాలయముల నొక్కసారి యేని గాంచినవ్యక్తి వానిని మఱువజాలడు. వీనిని బోలినవానిని మఱి చూడ జాలడు". -ఎల్ఫిన్‌స్టన్ : (హిందూదేశచరిత్ర)

ఈ భారత భూమినున్న మహానదులు-మానవ, పశు, పక్షి, సస్యాదులకు వలయు నిక్షురసమాధుర్యముగల జలమును సమృద్ధముగ నొసగును. నావల రాకపోకల వసతులు చేకూర్చును. నూతన లంకలను నిర్మించును. వేసవిని చల్లబఱచి జీవికి హాయి నొసంగును. వండలి రేవడలతో భూసారమును బెంపొందించును.

ఇందలి మైదానములు సస్యశ్యామలములై, పచ్చిక బీళ్లతో, వివిధ ఫలవృక్షములతో, సకల శాకములతో సుఖ సంపదల జేకూర్చుచు మనస్సున కానందము నొసగు చుండును.

ఇచ్చటి యరణ్యములో! మనకు కలప, లక్క, రబ్బరు, గంధపు జెక్క మున్నగువానిని విరివిగ ప్రసాదించును. వర్షముల బెంపొందించును. పశుపోషణమున కివి పరమ ప్రయోజనములు.

వెండి, బంగారము, రాగి, యినుము, బొగ్గు మున్నగు ఖనిజ సంపద యిందు విపులముగ గలదు.

ఎద్దులు, ఆవులు, గొఱ్ఱెలు, మేకలు, గుఱ్ఱములు, గాడిదలు, ఏనుగులు, పావురములు, గువ్వలు, కోళ్లు మున్నగునవి యనంతముగ నిందు గలవు.

వివిధ ధర్మములను విశ్వసించుచు, ననేక సంప్రదాయముల ననుసరించుచు, పరస్పర సహన స్నేహభావములతో బ్రవర్తించుచుండు ప్రజాసమూహమే యీ దేశ ప్రధాన సంపద. ప్రపంచమున నైదవ వంతగు నలువది కోట్ల మానవుల నీ దయామయి యగు భారతమాత యావశ్యక వస్తువులనెల్లనిచ్చి యనురాగముతో నల్లారు ముద్దుగ నాదరించుచుండును. ఒక్క మానవులనేగాదు; ప్రపంచమున మూడవ పాలు పశువులను, పలురకములగు పక్షి సంతతులనుగూడ నీభారతి యాదరభావముతో బాలించుచు, బోషించుచు నుండును.

పరదేశములందు పండని యెల్లపంటలు, ఫలపుష్ప శాకము లిందు ఫలించును. అప్పటికప్పుడు తయ్యారైన పదార్థముల ననుభవింపజేయుట కీ దేశమే యర్హమైనది. ఇంతటి ప్రకృతి సంపచ్ఛోభాయమానమగు దేశము ప్రపంచమున మఱెద్దియును లేదు. కావుననే పరదేశీయులెల్లరు నీ దేశమును 'భూలోకస్వర్గము' అని కీర్తించిరి.

ఇక మనవారో, యిందలి యమూల్యలోహరత్నాదులను జూచి 'రత్నగర్భ' యని స్తుతించి యుండిరి.

## ప్రాచీన భారతదేశము

భారతదేశము ప్రాచీనకాలమున సిరిసంపదల కాలవాలము. సత్య, ధర్మములకు శోభనమూర్తి. సంస్కృతి నాగరికతలకు మేలుబంతి. శాస్త్రములకు, కళలకు జన్మస్థానము. ఆమె విజ్ఞానవీచికలు ప్రపంచమున నలుదెసల విరివిగ వ్యాపించి ప్రపంచమున కొక నూతనతేజస్సును, సందేశము నొసగెను. మత సారస్వతములు, శాస్త్ర కళలు, కుటీరపరిశ్రమలు, వ్యవసాయము మున్నగు సర్వజ్ఞాన, విజ్ఞానములకీ దేశమే పుట్టినిల్లు.

"ప్రకృతియొసగగల సంపద, శక్తి, సౌందర్యములతో భాగ్యవంతమగు దేశమును, కొన్ని ప్రాంతములు భూలోకస్వర్గముగ నున్న దేశమును, ప్రపంచమందలి అన్ని ప్రక్కల నన్వేషించి నేను భారతదేశమువంకకే వ్రేలెత్తి చూపుచున్నాను. మానవుని మానసిక వికాస సమస్యలే యాకాశముక్రింద నభివృద్ధి గాంచినవన్నను, బెక్కు జీవితసమస్య లెక్కడ బరిష్కరింపబడినవన్నను, తత్సమస్యల పరిష్కార మెందుజరిగెనన్నను, ప్లేటో, కాంటుల జదివినవారి దృష్టి యెచ్చటి కాకర్షింపబడవలెనన్నను నేను

భారతదేశమువంకకే వ్రేలెత్తిచూపుచున్నాను. గ్రీకు, రోము, సెమిటిక్, యూదుల భావములతో బోషింపబడిన ఐరోపీయులమగు మనము మన బాహ్యాంతర జీవితములను ఇంకను నిర్దుష్టముగ - సమగ్రముగ - సర్వతోముఖముగ వేయేల ఇంకను స్వచ్ఛముగ, మానవోచితముగ సంస్కరించుకొని శాశ్వత జీవితమును బడయుటకు వలయు రసాయన మేదేశ సారస్వతమున లభించునా యని పరిశీలించితిని. పరిశీలించి యిది లభించెడిచోటు భారత వర్షమేయని వ్రేలెత్తి చూపుచున్నాను".—మ్యాక్సుముల్లర్:

('హిందూదేశము మనకేమి నేర్పగలదు' పుట ౧)

"ఆకర్షణీయమగు ప్రకృతి దృశ్యములును, సారవంతమగు భూములును, సాంద్రారణ్యములును, ఎత్తైన పర్వతములును, కొన్ని మహానదులును, పటుతరశీతలత్వమును, చెట్టుచేమలులేని ఎడారులును, చెమ్మలేని యిసుక మైదానములును, తీవ్రోష్ణదివసములును గలదై యితరములగు అన్ని దేశముల ప్రధానచిహ్నములతో భారతదేశము వెలుగొందుచున్నది. మానవత్వమునుగాని, ప్రకృతినిగాని పఠించు విద్యార్థికి నేటికిని అద్భుతసౌందర్యమును, ఆకర్షణమును ప్రదర్శించి సర్వదేశములకు రాణిగ నున్నది భారతదేశమే."
—హరవిలాస శారద.

"మనజాతికి (పాశ్చాత్యులకు) మాతృభూమి భారత దేశము. యూరపుభాషలకు మాతృభాష సంస్కృతము. మనతత్త్వశాస్త్రము (Philosophy) న కామెయే తల్లి. అరబ్బుల మూలమున విపులముగ లభించిన గణితశాస్త్ర మున కామెయే జనని. బుద్ధభగవానుని మూలమున క్రైస్తవమతాదర్శముల కామెయే జనయిత్రి. గ్రామ పరిపాలన రూపమున మన స్వపరిపాలనమునకును, ప్రజా పాలనమునకును నామెయే జన్మదాత్రి. ఆ భారతమాత పెక్కువిషయముల మన కెల్లరకు మాతృదేవియే."

—విల్ డ్యూరంటు : (అమెరికా ప్రఖ్యాత విజ్ఞాని)

"భారతదేశమున సర్వము విచిత్రము, వినోదమయము, విలాస విహార యోగ్యము. రసపుత్రస్థానమందలి వీరా వేశపరులగు రసపుత్రులు, పవిత్ర వారణాసియందలి నిశ్చల దైవభక్తిపూరితులగు బ్రాహ్మణులు, అశ్వారూఢులై పౌరుషమును వెలిగ్రక్కు మహారాష్ట్రులు, ఏనుగులపై శాంతముగ ప్రయాణ మొనర్చు నవాబులును ఇందుగలరు. ఈ ప్రఖ్యాత పవిత్ర దేశమునందు ప్రకృతిగూడ విచిత్ర మయమై వివిధ రీతుల వెలుగొందుచున్నది. భారత దేశ విపుల వృక్షసంపదను, ఝంఝూమారుతములను గాంచుము! సంతత హిమమయమగు హిమాలయముల

గంభీరతను, చెమ్మయైనను లేని యెడారులను చూడుము! విశాలమైదానములను, ఎత్తైనపర్వతశ్రేణులను కన్గొనుము! మరియు నన్నిటికిని మేటియై వెలుగొందు ఆమె చరిత్ర ప్రాచీనతను, ఆమెను స్మరించి కీర్తించు కావ్యసంపదలను తిలకింపుము!”

—కౌంటు జారన్సు, జర్మా.

“గ్రీసు దేశపు తత్త్వసిద్ధాంతముల కెవరితత్త్వసిద్ధాంతములు మేలుబంతులో, ప్లేటో, థేల్సు, పైథాగరసులు ఎవరిపవిత్ర గ్రంథములకు శుశ్రూషగావించిరో, అట్టియార్యఋషులనుబోలినవారు మరెచటగన్పింపగలరు? ఈ నాటికిని పాశ్చాత్యప్రపంచమునకెల్ల నచ్చెరువొనరించు గ్రహగతి విజ్ఞానదక్షులగుజ్యోతిష్కులెందుగాననయ్యెదరు? మనమన్నలకు పాత్రములైన కట్టడముల ననల్ప శిల్పముల చిత్రింపగలఅట్టిశిల్పులెక్కడగలరు? రాగస్వరభేదములుగల్పించి ఆనందమునుండి దుఃఖమునకు, దుఃఖరసమునుండి చిరునగవులకు మనస్సు నుర్రూతలూగించునట్టి గానకళావిదులింకెచటనైన నున్నారా?”

—కల్నల్ టాడ్: (రాజస్థానము.)

“భరతఖండమువంటి ప్రఖ్యాతదేశము ప్రపంచమున వేరొండు లేదనిన కాదనువారుండరు. వివిధ ప్రకృతి

దృశ్యములగాంభీర్యమున నేమి, సస్యపరి సమృద్ధియందేమి యీ దేశమున కేదేశమును సాటికాదు."—మ్యాక్సు పండితుడు.

"భారతదేశము భగవదనుగ్రహము గలిగిన కొలది దేశములలో నొకటియనియు, నైసర్గికవస్తుసముదాయము నందును, శిల్పకళలయందును, పండితుల రచనములందును ఉత్తమములైనవి సమృద్ధముగగల్గిన దేశమనియు చిర కాలమునుండి ప్రసిద్ధిగాంచినది."

—(ఎన్ సైక్లోపీడియా బ్రిటానికా. పుట. ४४౬.)

నాటి భారతీయులకు విశేషముగ శిల్పనైపుణ్యముండె డిది. కళాచాకచక్యముండెడిది. శాస్త్రపరిజ్ఞానముండెడిది. తమ దేశమునందే పండిన ప్రత్తి, నార, పట్టు మున్నగు పదార్థములతో ప్రశస్తమైన వస్త్రాదులనేసి, పరదేశముల కంపి యమితధనమార్జించుకొనెడివారు. విలువగలసరకుల నిచ్చి, వెండి బంగారముల దెచ్చుకొనెడివారు.అప్పుడెంతో రాజ్యబలముగల రోముదేశముకూడ 'అయ్యో! మన ధనమంతయు భారతదేశము లాగుకొనిపోవుచున్నదే!' అని పరిదేవనము నొందెడిదట. ప్రజలుతమ తెలివితేటలచే దేశములోని ద్రవ్యములతో మంచి మంచి సరకులు కల్పించి, స్వదేశవిదేశములకు విక్రయించి ధనమార్జించెడి వారు. విపణివీధుల నాకర్షించి ప్రఖ్యాతిని గాంచెడివారు.

వారికి చేతినిండ పని, కడుపునిండ తిండి, ఒడలినిండ బట్టయు నుండెడివి.

"అనేకాంగ్లవర్తకులును, తదితరులును తమ పడవల నిట ప్రతి సంవత్సరమును కట్టించుకొనుచున్నారు. ప్రశస్తముగ బెరిగిన ముదురుకర్ర యిచట గావలసినంత యున్నది. తీరమునందు దివ్యమైన యినుమున్నది. లంగరు మున్నగు నినుపసరకు లీ దేశస్థులు మిక్కిలి నేర్పుతో జేయుచున్నారు. సుప్రసిద్ధ నౌకానిర్మాత లిట ననేకు లున్నారు. పడవలు నిర్మించి, వాని గడలిపై విడుచుటలో వారికంటె నెక్కువ కుశలుల నీ ప్రపంచములో నేనెచటను జూడలేదు. తెరచాపలు, ఓడ పగ్గములు, నూలి నిచ్చెనలు మున్నగు నావికోపకరణములను వారుచేయు పద్ధతి కడు ప్రశస్తమైనది."

—'బాలసోరు'లోని పాశ్చాత్య వణిక్ప్రతినిధులు లండను లోని The Court of Directors కు వ్రాసిన ఉత్తరము.

"ఓ ప్రాచీనభారతవర్షమా! గౌరవాదరములతో నీకు నమస్కరించుచున్నాను. నేటికిని, నీ ప్రాచీనచింతనములకు ప్రణమిల్లుచున్నట్టియు, నానాట గిడసబారి శుష్కించు చున్నట్టియు, ఆజాతి విధ్వంసకము, ఆదేవ విధ్వంసకము, ఆయాత్మ విధ్వంసకమునగు నాపాశ్చాత్య ప్రపంచమునకు

నీబోధనమువలన నాశ్చర్యముగలుగుగాక!"—పియె రెలోటీ.
పరాసుదేశపు ప్రఖ్యాత విద్వాంసుడు.(౧౯౧౪ ఆగస్టు ఆర్యపత్రిక)

"స్వర్గము భారతదేశముననున్నదని యెవ్వరైన నుక్కి-వక్కాణించుచో నాశ్చర్యము జెందకుము. స్వర్గము హిందూదేశముతో సరిపోల్చుటకు పనికిరాదు."

—అబ్దుల్లా వసఫ్ (తజ్జియతులంసాన్)

"మానవునిమనస్సు ఎంతవిశాలముగ వ్యాపింపగలదో యా యంతమును హిందువులు కనుగొనినారు."

—మ్యానింగ్ సతి. (Ancient & Medieval India.)

"భారతీయులు సరళతగల సుఖజీవులు. యజ్ఞములందు సోమరసమును దప్ప, వారు మత్తుపదార్థముల నెప్పుడును సేవింపరు. వీరి ప్రధానాహారము బియ్యము. స్త్రీలకు సంపూర్ణస్వాతంత్ర్యముగలదు. స్త్రీలు వేదములుపఠింతురు. సన్యాసినులుగనుందురు. భారతీయులురాత్రులందుతలుపులకు తాళములవైచుట నెరుగరు. ఒడంబడిక వ్రాతలుగాని, చట్టములుగాని లేవు. చట్టవ్యవహారములన్నిటిని ప్రఖ్యాత సాంప్రదాయికమగు పంచాయతీవిధానముననేనిర్ణయించుకొందురు. పాటలీపుత్రప్రజలు చిత్రవిచిత్ర రత్నమయములగు నకిషీలతోగూడిన మజ్లినులను ధరింతురు. గౌరవ కుటుంబములకు జెందినవారు ఛత్రములతో విహరింతురు. సామాన్యులు తలపాగలు ధరింతురు." —రాలిన్‌సన్.

౧౮౦౩ సం॥లో ఇంగ్లండునకు యుద్ధనావలు హిందువులు కట్టిపెట్టెడివారు. భారతీయులగు నావికానిర్మాతల నుండి నమూనా లర్థించి తెచ్చుకొనెడివారు.

“జలసమృద్ధమై సేద్యము ప్రశస్తముగాజరుగుచున్నట్లు నా కగపడిన భారతదేశభాగములలో నిది(భరతపురసంస్థానము) యొకటి. పొలములలో పైరు పరమసుందరముగా నున్నది. ప్రత్తిపంట ప్రశస్తముగానున్నది. పండిన చెఱకు లప్పుడేకోసి బయలుచేసిన విశాలక్షేత్రములును, అనేకములైనచెఱకుగానుగలును నేజూచినాను. అన్నిటికంటెనుదేశ భాగ్యమునకివి యమోఘదృష్టాంతములు. ప్రజాబాహుళ్యమంతగా లేదుగాని పల్లెలన్నియు మిక్కిలి మంచిస్థితిలో నున్నవి. మరమ్మత్తులు బాగుగా జరుగుచున్నవి. కంపెనీ యధికారములోనున్న రాష్ట్రముల జూచి రాజపుత్రస్థానములో నింపైనయిట్టి వ్యాపారములు చక్కగాసాగుచుండు ప్రదేశముండునని నే ననుకొనలేదు. దీనినిబట్టి భరతపుర ప్రభువు ప్రజల దనబిడ్డలవలె జూచుకొని పరిపాలనము చేయు నసాధారణ ప్రజ్ఞావంతుడనిదైన నూహింపవలెను. లేదా బ్రిటిషు రాష్ట్రములందలి పరిపాలనావిధానము స్వదేశప్రభువుల పరిపాలనముకంటె ప్రజాసౌఖ్య విషయమునను, దేశాభ్యుదయ విషయమునను దక్కువ యను

కూలముగా నున్నదనియైన నూహించుకొనవలెను."
—బిషప్ హీబర్.

౨,౨౦౦ సం॥ క్రీతము గ్రీకురాయబారి మెగస్తనీసు భారతమును గాంచి విస్మయము జెందిన విధము గనుడు.

"వివిధాహారపదార్థములును విపులముగ గల భారతీయులు విగ్రహాపుష్టి సౌష్ఠవములతోడను, ప్రౌఢదృష్టులతోడను కళకళలాడుచుండుట గాంతుము. పరిశుభ్రమగు వాయువులను బీల్చుచు, పవిత్రమగు జలమును గ్రోలు జాతికి సహజలక్షణమగు కళానైపుణ్యము నందు వీరుసిద్ధహస్తులు. కృషిఫలితముగ భూమినుండిలభించుసర్వ ఫలములనుబడయుదురు. ఇచ్చట వెండి, బంగారము, రాగి, యినుము మున్నగులోహములు విపులముగ దొరకును. యుద్ధములకు, నితర ప్రయోజనములకు కావలసినంత తగరము మున్నగు లోహములు లభించును. మహానదుల జల ప్రవాహములతో నెల్లపంటలు పండింతురు. ఇట్లు వర్ణించుచుండుట విసుగు గల్గింపవచ్చును. కాని భారత దేశమున క్షామమునెన్నడు గానము. ఆహారపదార్థముల లోటెప్పుడును - ఈషణ్మాత్రమైనను గానము. క్షామములు రాకుండువిధానముల నేభారతీయులాచరింతురు. యుద్ధకాలమున పరదేశములలోపంటలునష్టపరచుట, సారవంతమగు భూముల నాశమొనర్చుట గావింతురు. కాని ఎట్టి భీకర

యుద్ధపరిస్థితులందునను, భారతసైనికులు వ్యవసాయము జోలికిపోరు. పైరు, పంటల నాశమొనర్పరు. జీవనాధారులగు రైతులను పవిత్రులుగ భావించి యిరుకక్షుల యోధులు వారిజోలికిబోని నీతినియమములకు కట్టుపడి యుందురు. మరియు పరస్పరము శత్రువుల భూములను దహనమొనర్చుటగాని, చెట్లనునఱకుటగానిపీ రెఱుగరు."

—మ్యాక్ కిండ్రిల్ : (ప్రాచీన హిందూదేశము.)

"దేశములో ప్రయాణముచేయుచున్న పరదేశికి చక్కగా సాగుబడిచేయుచున్న క్షేత్రములు, పాటుపడి పనిచేయు ప్రజలతో కిటకిటలాడు ప్రదేశములు, కంటికింపుగా కట్టబడి అభివృద్ధిలోనుండు పట్టణములు, విపుల వ్యాప్తిగలవాణిజ్యము, ఎటుదిరిగిచూచినను ప్రజాసంతుష్టిని సూచించులక్షణములు కంటబడును......టిప్పూనకు కలంకమాపాదించు సడులుగాని, నుడులుగాని యెవరి నోటను వినబడెడివిగావు." —లెఫ్టినెంట్ కలనల్ మూర్.

"ప్రజలయర్థప్రాణములిట(వంగదేశమున)సురక్షితములు. సరకుతోబోవు వర్తకుడైనను సరే సామాన్యపథికుడైనను సరే యీదేశములో ప్రభుత్వజాగరూకతచేసురక్షితముగా ప్రయాణముచేయగలడు. దమ్మిడిఖర్చులేకుండ, ఆరెకులు వెంట వచ్చి యంగరక్షకులై యతని నొక మజిలీనుండి

యొక మజిలీకి గొంపోదురు. ధనవంతమగు 'డక్కా' మండలపుభూములన్నియు సాగులోనున్నవి. ప్రజలకు నిష్పక్షపాతమైనన్యాయము దొరకుచున్నది. పరిపాలకుడగు 'జస్వంతరాయడు' సద్విద్యాశిక్షితుడైన ప్రభువు. విమలాంతఃకరణుడు. ఋజుమార్గవర్తి. విసుగుగొనక, శ్రమకోర్చి, అప్రమత్తుడై తన పరిపాలనకృత్యమును చేసికొనుచు ప్రజాసౌఖ్య స్వాస్థ్యము లొనగూర్చుచున్నాడు. ప్రభుత్వము వారెవరికో కొందఱకు సర్వగ్రాహకముగా సరకుల నిచ్చుపద్ధతి యతడు కొట్టివేసినాడు. ధాన్యములపై పన్ను వేయుట మానివేసినాడు." —హాల్వెల్.

"ప్రశస్తమగు కృషివిధానము, సాటిలేని వస్తునిర్మాణ నైపుణ్యము, నిత్యజీవితావసరవస్తువులను, విలాసవస్తువులను నిర్మించు సుకుమారహస్త కౌశలము, చదువు, వ్రాత, గణితములుబోధించుపాఠశాలలును:దయాదాక్షిణ్యములు, దానధర్మములతో గూడిన అతిథిసత్కారము, పరిపూర్ణ విశ్వాస గౌరవ సరళత్వములతో గూడిన స్త్రీస్వభావముతో స్త్రీలు మెలగుటలే నాగరికజాతుల లక్షణములగుచో పాశ్చాత్యజాతులకు భారతీయులు తీసిపోరు. కాని నాగరికత ఎగుమతి దిగుమతులు గావించు వ్యాపారమే యగుచో భారతదేశముకంటె నాంగ్లదేశమే మిన్నయని నాభావము." —సర్ థామస్ మన్రో, (మద్రాస్ గవర్నర్.)

"మహారాష్ట్రుల దేశము నేజొచ్చినపుడు కృతయుగము నాటి యకాపట్యానందముల మధ్యమున నేనుండినట్లు నాకుదోచినది. ప్రకృతిసహజ సౌందర్యమచట నింకను మారిపోలేదు. యుద్ధపీడలింకనువారిని జెనకలేదు. ప్రజలు పూర్ణారోగ్యవంతులుగను, చిత్తోల్లాసము గలవారుగను నాకు జూపట్టిరి. అత్యంతమైన యతిథి సత్కార మా దేశములో సర్వజనసామాన్యమైన సద్ధర్మముగా నాకుగాన్పించినది. 'వచ్చిమాకున్న దేమో యథేష్టముగననుభవింపుడు' అని యానందముతో నాహ్వానించుచున్నట్లు స్నేహితులకు, ఇరుగుపొరుగువారికి, అపరిచితులగు వైదేశికులకు, అందరకునచ్చటి ప్రతిగృహము సుగమమైసిద్ధముగానుండును."

—అంక్వెటిల్ దూ ఫెర్రాడ్.

"తమ యిండ్లతలుపులకు తాళములు వైచికొనుటయు, ఒడంబడికలకు పత్రములను వ్రాసికొనుటయు భారతీయుల కగత్యము లేదు. వారంత నిజాయితీ మనుష్యులు."

—స్ట్రాబో.

"ఆర్జవము, న్యాయబుద్ధి భారతీయులవిశేషగుణములు. ధనవిషయమున నొక్కపైసయైన నక్రమముగ స్వీకరింపరు. న్యాయవిషయమున తమ హక్కుల నెక్కువగ వదలుకొనియైనను సామరస్యముకొఱకు ప్రయత్నింతురు. ఋజుత్వము వారి ప్రధానలక్షణము.'

—యువాన్ చ్వాంగ్.

"సత్యమును వక్కాణింపవలెనన్న భారత దేశమే నాకు పుణ్యభూమి. పాశ్చాత్యశాస్త్రముల కన్నిటికిని హైందవ తత్త్వశాస్త్రము తల్లివేరు. సర్వమతములకును భారత ధర్మ ముత్పత్తిస్థానము. భారతదేశము ఆధ్యాత్మికవిద్యకు మాత. నాగరికతకు ఊయెల. భారతదేశపువ్యక్తిత్వమ్ము, ఆత్మోద్దీపనములు నాదేశధర్మమునందేగలవు.భారతీయుడు మతమునే భుజించును. మతమునే పాన మొనర్చును. మత మునే పీల్చును. మతమునందే నిద్రించును."

-అనిబిసెంటు.

"భారత ప్రజలు ప్రపంచమందలి యితర జనులందరి కంటెను ఎక్కువ పాటుపడి పనిచేయువారు. వారి భూము లలో నత్యధికభాగము సారవంతమై పుష్కలముగా ఫలించును."

—మేగ్డనాల్డు మంత్రి.

ప్రాచీనకాలము నుండియు భారతదేశము మతమ్ము, శాస్త్రములు, కళలు మున్నగు విద్యలందేగాక, వర్తక వ్యాపారములందును,అర్థసంపదయందును,విపులవిజ్ఞానము లందును సమ్మానముల బడసి ప్రఖ్యాతిని గాంచెను. ఈస్టిండియా పరిపాలన కాలమునగూడ భారతదేశ మన్ని విధముల ఔన్నత్యమును గాంచి యుండెను.

# భారతము ఏకదేశమే

పాశ్చాత్య చరిత్రకారులు, రాజకీయవేత్తలు తమ యజ్ఞానమువలననో, ద్వేషము వలననో లేక స్వార్థము కొఱకు బుద్ధిపూర్వకముగనో మన దేశమునుగూర్చి అసత్యప్రకటనములును, దుష్టప్రచారములును గావించు చున్నారు. కొలదిమంది భారతీయులు వీరి ననుకరించుట విచారకరము, గర్హ్యము. రాగద్వేషములకు గురిగాక యథార్థమును ధైర్యముగ బ్రకటించుట సత్యాన్వేషకుల ప్రధానలక్షణము. పరులను విమర్శించునపుడు విషయములు విపులముగ స్వీకరించి, స్పష్టముగ గ్రహించి, ఉదారభావముతో తర్కించి విమర్శింపవలెను. తమ నిర్ణయములు బలిష్ఠాధారములపై సహేతుకముగ నుండవలెను.

'భారతదేశ మేనాడును ఏకదేశముగ బరిగణింపబడ లేదు. ప్రాచీనకాలమునుండియు భారతీయులకు జాతీయత లేదు. నేటి జాతీయ భావము పాశ్చాత్య పాలకుల సాహచర్య ఫలితమే' యని కొందరు నుడువుచున్నారు. భారతదేశ మేకదేశమే యని ధ్రువపఱచు శాస్త్రసమ్మతములు, సహేతుకములు నగు పెక్కునిదర్శనములున్నను, సత్యాన్వేషకులగు ప్రాక్పశ్చిమ చరిత్రకారులు పెక్కురు

ప్రబల నిదర్శనములచే బలపఱచుచున్నను ఈ యసత్య ప్రచారమింకను సాగుచుండుట కేవలము మన బానిస తనపు ఫలితమే యని నుడువక తప్పదు.

కాని మన సంస్కృతి, నాగరికత, సాంప్రదాయాచార ములు, సహజ భౌగోళికస్థితి హిందూదేశపు ఏకత్వమును సర్వదా మనకు ప్రదర్శించుచునేయున్నవి. దీని నేవిధము గను కాదనజాలము. ఇట్లు కాకుండ చేయనులేము.

వైదిక కాలమునుండియు నీదేశపు సంస్కృతి నాగరి కతలు పరంపరా ప్రవాహములే. ఆర్యావర్తము, భరత ఖండము మున్నగునవి యీ మనదేశమునకు ప్రసిద్ధ నామములు. ప్రతియార్యుడును నిత్యము తన సంధ్యావంద నమున గీర్తించునది యీదేశమునే, ఇందలి నదులనే. (భరతవర్షే, భతరఖండే) ఇక్ష్వాకులు, కౌరవపాండవులు, గుప్తరాజులు, అశోకుడు, అక్బరు మున్నగువారెల్లరు నీదేశము నొక్కదేశముగనే పాలించిరి.

"భారతదేశము సముద్రములతోడను, పర్వతముల తోడను చుట్టబడి వివాదములేని భౌగోళికైక్యమును బ్రదర్శించుచు న్యాయముగ నేక నామముతోడనే పిలువ బడుచున్నది. పెక్కువిషయములందుపరదేశ నాగరికతలకు దీని నాగరికత విభిన్నముగ నున్నను తన సాంఘిక, వైజ్ఞా

నిక, జీవిత విషయములందు ఐక్యమును బ్రదర్శించి యేక దేశమే యను భావమును ధ్రువపఱచుచున్నది.''

—విన్సెంటుస్మిత్.

''భారతదేశపు ఏకత్వము ధార్మిక సంస్కృతులకు సంబంధించినదే గాని కేవలము రాజకీయము మాత్రమే గాదు. ఈయైక్యము కనీసము 2000 సం॥ల నుండి సారస్వతమునను, జాతీయతను గలదేగాని క్రొత్తదిగాదు. ఇది హిందూదేశమని కాక ఆర్యావర్తము, భరతవర్ష మనియే పిలువబడెను. అశోకుడు జంబూద్వీపపు రాజనిపించుకొనెను. భారతీయులు తమ దేవస్థానములను, పుణ్యక్షేత్రములను, పుణ్యనదులను, ఉత్తరమున హరిద్వారము, బదరీకేదారములను, దక్షిణమున కంచి రామేశ్వరములను, పడమర ద్వారకను, తూర్పున జగన్నాథమును స్తుతింతురు. ఈవిధమగు మత సంస్కృతుల యైక్యము ౧౬ శతాబ్దముల వరకు నిరంతరాయముగ వచ్చినది. కాని యిది క్రీస్తునకు తరువాత ౮ వ శతాబ్దియందు మాత్రము అరబ్బులచే కొలదిగ విచ్ఛిన్న మొనర్పబడెను.'' —అనిబిసెంటు.

'ఈదేశ మొక పెద్దభూభాగము. ఇందు వివిధ మతములు, భాషలు, తెగలు, ఆచారములు గలవు. కావున దానినొక ఖండ మనదగునే గాని దేశ మనజనదు.' అని

కొందరు వాదింతురు. పైన పేర్కొన్న విషయములెల్లను సత్యములే గాని యీ దేశమును ఖండమనుట మాత్రము సత్యదూరము. దేశము దేశమేగాని ఖండ మెట్లగును?

రైళ్లలో, విమానములలో దేశము నటునిటుచూచి, మిడిమిడి జ్ఞానమున పిడివాదము గావించుచు, వ్రాయువ్రాత లందుపటుత్వముండజాలదు. పైపైనగాన్పించుభిన్నత్వము నందు లీనమై, సజీవమై, కాలక్రమముగ వర్ధిల్లిన నాగరికతా సంస్కృతుల యైక్యమే దేశైక్యమును ప్రదర్శించుచున్నది. పరదేశీయుల క్రూరములగు దాడులను, వికృత సంఘర్ష ణములను పటుత్వముతో నెదుర్కొని, తన నాగరికతా సంస్కృతులతో తన యైక్యమును కాపాడుకొనుటయేగాక పరులసుగుణములను గుర్తించిజీర్ణించుకొన్న దేశమిద్దియే. ఈ దేశపు నాగరికతా సంస్కృతులకు కేంద్రము ఆర్యజీవన పథము. ఇందుండియే సర్వతోముఖాభివృద్ధి బడయు చున్నది. ఈనాటికిని ఈకీలకము బలీయముగనే యున్నది. ప్రాచీనకాలమునుండియు నిందలి ప్రజలీదేశము నేకము గనే భావించిరి.

తీర్థయాత్రలు, పుణ్యక్షేత్రపర్యటనములు, ఆటపాటలు, ఆహారవస్త్రనియమములు, గృహపరికరములు, మత నైతిక రాజకీయ ఆర్థిక ప్రబోధము లిట్టియైక్యమునే ప్రద ర్శించుచున్నవి. భిన్నత్వమున నేకత్వమును గాంచుటయే

భారత విజ్ఞాన వికాసఫలితము. సంస్కృతి నాగరికతల నిగ్గు. నిత్యజీవితలక్షణము. ప్రకృతి వైచిత్ర్యమునందు పరబ్రహ్మ మును గాంచుటయే భారతీయుని గమ్యస్థానము. 'ఏకమ్ సద్విప్రా బహుధా వదంతి' యనునదే భారత విజ్ఞానమున పరమ వాక్కు. వివిధ నదులు వివిధ ప్రాంతముల జన్మించి వంకరటింకరగ ప్రవహించుచు తమ గమ్యస్థానమగు సాగరమునే చేరును. విధులు వివిధములైనను ధర్మ మొక్క టియే. భగవంతుని ప్రార్థించి ప్రత్యక్ష మొనర్చుకొను టకును, రాజునెడ ప్రవర్తించు విధానమునకును, బంధు మిత్ర సేవ కాతిథుల నాదరించుటయందును ఒకే లక్ష్యము గలదు. రాజకీయ ఆర్థిక నైతిక మతములందు సామరస్య మును ప్రదర్శించును. పెద్దలు, పిన్నలు - సర్వజను లీ ధర్మమునకు కట్టువడియుండవలసినదియే. జాతిమత విభేద ములతో ఈర్ష్యాద్వేషములు గలిగియుండక సహనశక్తిని ప్రదర్శించుచు, విజ్ఞాన నైతిక వికాసములెందున్నను వానిని స్వీకరించి మానవత్వమును ప్రబలజేసినది మన సంస్కృ తియే.

భారతదేశము మన మాతృభూమి. ఇది కర్మభూమి, పుణ్యభూమి, స్వర్గమునకన్న మిన్న అని భావింతుము. 'ఇది దేవతలచే సంస్కరింపబడిన దేశ'మని మనువు నుడివెను.

"తమ పుణ్యకర్మముల ఫలితముగ పునర్జన్మమును బొందవలసినపుడు దేవతలు భరతవర్షమునందే జన్మము వాంఛింతురు."

—విష్ణుపురాణము.

"వేలకొలది సంవత్సరముల యాధ్యాత్మిక చింతనమును, జీవితమును గలిగిన వ్యక్తులే భారతదేశమున జన్మించు నదృష్టమును బడయుదురు. తదితరదేశములకన్న భారత దేశమునందు జన్మించిన వారికే ముక్తికెక్కుడవకాశములు గలవు. ఏలన: ఆధ్యాత్మిక చింతనములను, తపశ్శక్తిని బెంపొందించుకొను నెక్కువ కాశముల నీదేశ మొసగును."

—రాధాకుముద ముఖర్జీ.

"భారతీయుల యాత్రాప్రాంతములు ఎత్తైన హిమవత్పర్వతములందును, నారికేళ వనరాజితములగు సముద్ర ప్రాంతములందును, లంకలందును, పర్వతగుహాలు,లోయలందును, సాంద్రారణ్యములందునుగలవు. ఈకారణమున యాత్రికులు తఱచుగ దేశమంతయు చుట్టి రావలసి యుందురు.

సంకుచిత రాష్ట్రసంఘ భావములనుండి విముక్తి గావించి, విద్యావిహీనులగు సామాన్యప్రజలందు గూడ విపుల విజ్ఞాన వివేకములను, సహనశక్తిని, రాజకీయాభివృద్ధిని బెంపొందించు నున్నత విధానమిద్దియే. ఇది భౌగోళి

శములగు హస్తులను విశాలమొనర్చి రాజకీయాభివృద్ధికి పునాదులు వైచును. తమ విశాల మాతృదేశము నేక దేశముగ గమనించి, ప్రేమించి పూజింపజేయును."

—రాధాకుముద ముఖర్జీ.

'ఓ గంగా యమునా గోదావరీ సరస్వతీ నర్మదా సింధు కావేరీ జలములారా! నే నర్పించు నీ జలమునందు మీరు ప్రవేశింపుడు' అనియే తన సంధ్యావందనమున ప్రతి యార్యుడును గీర్తించునది. తాను నివసించు చిన్న ప్రాంతమునుండి యావద్దేశము నామూలాగ్రముగ స్మరియించుటయే యిందలి పరమార్థము.

భారత దేశమునందలి వివిధజాతులు, భాషలు, మతములు, సాంప్రదాయములుగన్న నివి దాని యేకత్వమును సుస్థిరములగు పునాదులపై గావించినవనియే ధ్రువపడును. జీవి ఉన్నత స్థానమునకు పరిణామము గాంచినకొలదియు నద్దాని యవయవ విభేదము విస్పష్టమగును. వివిధ కార్యములకు భిన్న భిన్నావయవములు పూర్ణముగ నేర్పడును. శరీరమునందలి కన్ను, ముక్కు, చేయి, కాలు వేఱుగ నున్న నివియెల్లను శరీర సమిష్టి పోషణ నిర్వాహణమునందే మునిగితమ ప్రత్యేకవిధులనందులీన మొనర్చును. మొండెము వేరు, అవయవములు వేరు గాన శరీరికి ఏకత్వముగానీ,

వ్యక్తిత్వముగాని లేదని వాదించుట యవివేకము, హాస్యాస్పదము. ఈ దేశమున వంగ, కళింగ, ఆంధ్ర, మహారాష్ట్రాది ప్రాంతీయులు వివిధభాషలతో వ్యవహరించుచున్నను, హిందూ బౌద్ధ జైన సిక్కు క్రైస్తవ మహమ్మదీయ మతస్థులున్నను వీరెల్లరు దేశ సౌష్ఠవమున కవసరమే.

ఒకే ప్రాంతమును, దానిని సమానముగా సేవించు నవకాశములే దేశనియమములు. ఒకే దేశమున నుండి, దానినారాధించి, యది యొసగు ఫలితముల ననుభవించుచు, నభివృద్ధిగాంచు వారొకేభాష మాటలాడ నవసరము లేదు. ఒకే దేవతనారాధింపవలసినయగత్యమును లేదు. భిన్నత్వమున నేకత్వమును గాంచుటే యున్నత సంస్కృతి నాగరికతల ప్రకటించును. వివిధరుచుల, రీతుల యాహారములు భుజించినను క్షుద్బాధను మాన్పి బలారోగ్యముల నొసగుటయే వాని ముఖ్య ప్రయోజనము. నిత్యము మన జీవితములో గాంచున దిదియే. ప్రకృతి సర్వదా మనకు బోధించున దిదియే. దీనిని స్పష్టముగ గమనించియు సమ్మతింపకుండుటను, ఆచరింపకుండుట నేమనవలయునో మాకు గోచరించుట లేదు.

ఈనడుమ పాకిస్థానపుపిడివాదములు ప్రజ్వరిల్లినవి. దేశమును ముక్కలుముక్కలుచేసెడు కుతంత్రములనుకొందరు

బలపరచియున్నారు. ప్రజలను వేరు వేరు చేయుచు ఐక్యమునకిది సాధనమందురు. దేశవిభజన యేదృష్టితోను పనికిరాదని పైన బేర్కొనిన కారణములు ధ్రువపరచు చున్నవి. అయిన నీవిషయమున పరదేశములెట్లు ప్రవర్తిం చినవో ఒక్కపరి తిలకింపుడు. గ్రేట్ బ్రిటన్, అమెరికా, జర్మనీ, ఇటలీ మున్నగు దేశముల చరిత్రను గాంచుడు.

స్వాతంత్ర్యోద్యమమునకు పూర్వము అమెరికా యేక దేశముగ లేదు. అప్పటిపరిస్థితు లైక్యమున కనుగుణముగ లేవు. భౌనిసలక్షణములు ఐక్యమును దూరపఱచును. "ఆంగ్లసంతతులమధ్య డచ్చి, జర్మన్, ఫ్రెంచి, స్విస్, స్కాచ్, ఐరిషు జాతులు భిన్నభిన్నములుగ వ్యాపించి పూర్తిగ విభేదములను ప్రబలజేసినవి. వివిధ ప్రభుత్వ ములు భిన్న లక్షణములను, భిన్న మత విశ్వాసములను, భిన్న వ్యాపార దృక్పథములను, సాంఘిక విభేదములను బ్రదర్శించుటచే విప్లవారంభమునందు వీరియేకత యసం భవమని పెక్కరకు గాన్పించెను." —లేకీ.

"ఉత్తర అమెరికాయందలి వివిధములగు వలస ప్రాంత ములు అగ్ని జలములకన్నను మిన్నయైన భిన్నత్వము గలిగి యున్నవి. పరస్పరము ప్రదర్శించు ఈర్ష్యాద్వేషముల కంతు లేదు. జెర్సీలంకల వర్తకమునకై పెన్సిల్వేనియా

న్యూయార్కు నివాసుల యార్థ్యాభివృద్ధికి అంతులేని యవకాశ మేర్పడెను. నడవడిలో, ఆచారమతవిశ్వాసము లలో భిన్నత్వమును బ్రదర్శించు వలసలవారిని విచ్చలవిడిగ విడిచిపెట్టినచో - మానసిక తత్త్వము నాకు బోధపడినంత వరకు-దేశమందంతటను వెంటనే యంతఃకలహములు చెల రేగెడివే. ఇట్టిస్థితినే ప్రబలనిచ్చినచో నీగ్రోలను, రెడ్ ఇండి యనులను నాతురతతో నంత మొందింప నెదురుచూచు చుండెడివారే." —బర్నాబి.

"ఈ వలస ప్రాంతములను తమ తమ స్వేచ్ఛకు నేడో రేపో విడిచిపెట్టుచో అమెరికా రక్తప్రవాహపూరితమై దారియు తెన్నునులేని దేశమయ్యెడిది." —ఓటిస్.

జఫర్సన్ అమెరికా స్వాతంత్ర్య ప్రకటనమును గావించిన సమయమున నీగ్రోలు, నార్వే, ఫ్రెంచి, డచ్చి మున్నగు పెక్కు జాతులవారు పెక్కుభాషల మాట లాడుచు పరస్పరవైరుద్ధ్యము గలిగియుండిరి. వాషింగ్టన్ కాలమున అమెరికాలో ఐక్యము లేనేలేదు. కెనడా వేరు గానే (నేటికిని) యున్నది. అబ్రహాము లింకను కాల మున నంతఃకలహములు విచ్చల విడిగ చెలరేగెను. కొలదికాలము క్రితము క్లూక్లక్సుక్లాను ఉద్యమము ప్రబలి నీగ్రోలను, యూదులను, రోమను క్యాథలిక్కు

లను వెడలగొట్ట తీవ్ర ప్రయత్నములు జరుగ లేదా? నేటికిని నీగ్రోలకు, రెడ్ ఇండియనులకు ప్రాతినిధ్యము సరిగ లేదే! అయినప్పటికి నమెరికా బలవత్తరమగు సంయుక్త ప్రభుత్వముతో వర్ధిల్లుచుండుటలేదా?

గ్రేట్ బ్రిటనులో శాక్సనులు, కెల్టులు, డేనులు, నార్మనులు శతాబ్దములకొలది నిరంతర పరస్పర యుద్ధములతో హత్యలుగావించుకొనుచు కాలముగడపిరి. ఇంగ్లండు స్కాట్లాండులు పారంపర్యముగ శత్రుదేశములు. ట్వీడ్ నదికన్నను మిన్నగ నీ రెండు ప్రాంతములను వీరి రక్త ప్రవాహమే విడివడ జేసెను. ౧౩ శతాబ్దములు ఎడ తెరపిలేని రక్తప్రవాహమును బ్రవహింపజేయుచు వచ్చిన వీరు 3 శతాబ్దముల క్రితము మాత్రమే యేకదేశముగ కలియగలిగిరి. ఉభయులును నేడు గ్రేట్ బ్రిటనును తమ మాతృదేశముగ భావించి గర్వించుటలేదా! ఇద్దాని స్వాతంత్ర్యమునకై తమ సర్వస్వమును ధారబోయుట లేదా! గ్రేట్ బ్రిటనులోనే బ్రిస్టలులో మాటలాడిన భాషను బెల్ఫాస్టులో మాటలాడరు. ఎబర్డీన్, రోండా జిల్లాలు వేరువేరు భాషలు మాటలాడును. ఇట్లున్నను ఆంగ్లేయులు తమ డౌనింగువీధి నుండి విశాల సామ్రాజ్యమును బాలించుచుండలేదా?

వివిధజాతులు, ప్రాంతములు గల యిటలీ దేశభక్తులు 'రోము' అను నేకనగరముక్రింద తమ జాతీయతను బ్రకటించుకొనిరి. ఇటలీని నేకదేశముగనే భావించియందలి ప్రజలు తమ దేశభక్తిని బ్రకటించుచు దానియౌన్నత్యమునకు తీవ్రకృషిని గావించుటలేదా!

జర్మనీలో నొకే మతమునకు జెందిన రోమను క్యాథలిక్కులు, ప్రొటెస్టెంటులు గొడ్డళ్ళతో సర్వదా తలలు బ్రద్దలు గావించుకొనుచు, చిచ్చులతో కాల్చుకొనుచు, దారుణకృత్యములు గావించుచు జీవితములను గడపిరి. అయినను జర్మనీ యేకదేశముగాదా! అచటి ప్రజలు తమ పితృదేశాభివృద్ధికి నేకముగ కృషిగావింపరా!

ఈ విధముగ నెన్నియేని యుదాహరణములను జూపవచ్చును. పైన బేర్కొనిన ప్రాంతములు దేశములెట్లయినవి? అందలి ప్రజలు దేశభక్తులుగ నెట్లుమారిరి? మనోవికాస ఐక్యభావపటిమచేతనేగదా! భావమే దేశమునందు ఐక్యమును జేకూర్చును. వాస్తవమునకు అమెరికా, గ్రేట్ బ్రిటన్, ఇటలీ, జర్మనీ యను నామములుగల ప్రాంతములు లేనేలేవు. అట్టిచో నివి దేశములెట్లయినవి? పలు భీకర సంగ్రామములకు గురియైన వివిధజాతులే జాతీయతను, దేశభక్తిని బ్రదర్శించుచు నభివృద్ధిని

గాంచుచుండ ప్రశాంత జీవితమును గడపు భారత దేశము ఒకే దేశము కాదని కొందరేల ప్రచార మొనర్ప వలెను? ఐక్యము, సహజలక్షణ సామ్యము గల యిట్టి దేశమును వేరొక్కదానిని జూపుడు.

భారతదేశమున, పరప్రభువులు తమ యధికార ప్రాబల్యమును, నిరంకుశత్వమును నిలుపబెట్టుకొనదలచి, 'విభజించి పాలించు' సూత్రమును సర్వదా యవలంబించి, కొందరు స్వార్థపరులను పైకెత్తి, దేశమున నైక్యము లేదని బోధించి విభాగమున కవకాశము లేర్పరచిరి. జిన్నా నొకసాధనముగ వినియోగించుకొని పాకిస్థానవిభజనమును జేసిన దాంగ్ల ప్రభుత్వమే. కొంతకాలము అంబేడ్కరు నగ్రస్థానముననుంచి హరిజనులు హిందువులు కారను నవివేక వాదమునుగూడ నాంగ్ల ప్రభుత్వము రేకెత్తించినది. కాని మన దేశనాయకుల యుదార త్యాగపటిమ చేతవిశ్వాస దానముచే నాయాట సాగనందులకు సంతసింపఁగును. స్వయంనిర్ణయ సూత్రమనుసాకుతో మతపు పునాదులపై దేశమును విభజింపవలెనను నసహజభావములనలుమూలల ప్రవహింపజేసినదియు నాంగ్ల ప్రభుత్వమే. మనలో కొందఱు స్వార్థపరులును మూర్ఖత్వముతో నిట్టి పిచ్చివాదములను సమర్థించిరి కాని స్వాతంత్ర్యసంపాదనముతో నివి మూల

బడ్డవి. ఐనను దేశము ముక్క చెక్కలుగా నుండవలసిన దేనా !

రష్యాలోని సంస్కృతి, స్వాతంత్ర్యము వేరు. పాకిస్థాన విభాగము వేరు. నేటికిని సోవియట్ రష్యాలో చెక్క రాష్ట్రములకు విడిపోవుటకు హక్కు లేనే లేదు.

భారతదేశము సర్వదా యేకదేశమే. ప్రతి భారతీయుడు దీనిని ప్రకటించి కీర్తింపవలెను. ప్రపంచ మిది వఱకే దీనిని గుర్తించెను. ఈ యఖండ దేశభావమే భారతీయుల ధర్మము, ఆదర్శము, గమ్యస్థానము. ఇదియే సత్యము. దీనిని మనము సాధించి తీరవలయును.

ప్రథమమున భావసృష్టి. తరువాత దాని తీవ్ర ప్రచారము. తత్ఫలితముగ నీ భావమును మూర్తిమంత మొనర్చుట. ఇదియే ప్రతి భారతీయుని కర్తవ్యము.

దీనిని పాటించి పాలించిననాడే మన మాతృదేశము పునరుజ్జీవితమును బడసి సకలసంపదల కాలవాలమై విలసిల్లును. అందరకు క్షేమమును జేకూర్చి ఆనందము నందించును.

# భారతీయ ప్రకృతి రహస్యము

భారతదేశ ముష్ణదేశముగాన భారతీయులు సోమరులు, కామాతురులు, అని పెక్కురు పాశ్చాత్యులు వ్రాసిరి. దీనినిగూర్చి కొంచెమునిదానముగ నాలోచింతము.

భారతదేశము ప్రకృతిసౌందర్యసంపన్నము. సిరిసంపదల కాలవాలము. ఈ దేశము తన యమూల్య ప్రకృతి సంపదను తన సంతతికొసగుచున్నది. కావున భారతీయులు పాశ్చాత్యులవలె తమ నిత్యజీవితావసరములకు దేవులాడ నవసరము లేదు. పొట్ట చేతబట్టుకొని పరుల పీడింపనక్కర లేదు, వారివలె నాహారమునకు శ్రమపడవలయు నగత్య మునులేదు. అందువలన భారతీయుల కెక్కుడు విశ్రాంతి లభించుచున్నదనుట సత్యమే. కాని యిట్టి విశ్రాంతి లభించి నదిగావున వీరు సోమరులని పలుకుట సాహసము, అవివే కము. శారీరిక విశ్రాంతిని మానసిక వికాసమునకు విపుల ముగ వినియోగించినవారు భారతీయులే. కామచింతనము నకే శారీరికవిశ్రాంతిని వినియోగింపవలెనను వాదన పాశ్చా త్యులకు పాడియేమోగాని భారతీయులకు మాత్రమట్టి తుచ్ఛభావములు లేవు. ప్రకృతిచిత్రవిచిత్రమైసౌందర్యము, విలాసము, వికాసములను భారతీయుల కొసగుచున్నది.

కావుననే ప్రకృతి కన్యను భారతీయుడు మనసార తిల కించి ఆనందసాగరమున నోలలాడుచున్నాడు.

భారత జీవిత విధాన విభాగసౌష్ఠవమును గాంచుము. బాల్యమున బ్రహ్మచర్యదీక్ష గైకొని, విద్యార్జనమును బూర్తిగావించు వఱకు నద్దానిని మనోవాక్కాయముల బాలింపవలెను. గురుసన్నిధానమున నీనిష్ఠను బలీయముగ బాలించుటయందే భారత విద్యావికాసము గలదు. కావున విద్యార్థి విధిపూర్వకముగ తన మనస్సును పవిత్ర విషయములందే ప్రవర్తింపజేసి వికసింపజేయును. గృహ స్థాశ్రమునగూడ నిష్ఠతోగూడిన ద్వితీయ బ్రహ్మచర్య మును బాలింపవలెను. స్త్రీ సంభోగము కేవలము కామ తృష్ణను దీర్చుకొనుటకుగాక సత్సంతానము బడయుటకే యని తలచి మెలగినవారు శరీర పోషణమునకు విశేష శ్రమ గావింప నగత్యములేదు గావుననే ఆత్మవికాసము నకు, ఆత్మోద్దీపనమునకు వారు కృషిగావించి ప్రఖ్యాతి గాంచిరి.

'పాశ్చాత్యులు సర్వదా శరీరశ్రమ గావింతురు గాన వీరికి నీచవాంఛలు, కామతృష్ణ తక్కువ'యని నుడువుట నీరసమగు వాదము. శరీర సుఖములకై పాటుపడు వారి యందే నీచభావములు, కామతృష్ణ, పాశవిక వాంఛలు విశేషముగ, విచ్చలవిడిగ ప్రబలుట సహజము.

భారతదేశపు ప్రకృతి సంపన్నమయమే గాక సౌందర్య పూరితము. ఇందులకు భారతీయుడు కృతజ్ఞుడు. ప్రకృతికి సౌందర్యమును జేకూర్చునది దాని వివిధత్వమేగదా! సృష్టి వైచిత్ర్యమయము. భారతీయుడు ఈ సృష్టివైచిత్ర్యమున సర్వదా లీనమై ఆనందపరవశుడగుచుండును. ఆతడు ఉభయ సంధ్యలందు, రేబవళులందు, వివిధ మాసములందు, ఋతువులందు ప్రకృతిమాతృగంభీరతను, సౌందర్యమును గాంచుచు దానితోనైక్యమగుచుండును. ప్రకృతిని సర్వదా - ధారారూపమగు ప్రేమతో పూజించి, యానందించుటయే భారతీయుని సహజస్వభావము. వీనిని 'ప్రకృతి పూజారి' యన్నను అతిశయోక్తిగాదు. ఇతడు సూర్యచంద్రులను, గ్రహనక్షత్రములను, భూమ్యాకాశములను, సముద్రతరంగములను, పర్వత శ్రేణులను, నదీ ప్రవాహములను, సాంద్రారణ్యములను గాంచి పవిత్ర హృదయముతో ఆత్మానుభూతి నలవరచుకొనుచుండును. ఉషస్సంధ్యలు పవిత్రదృశ్యములు. ఇవి సచ్చిదానందమునకు దారిచేయు సోపానములు. పశుభావములను ప్రకోపింపజేయు శక్తులనెల్ల భారతీయుడు పవిత్రములుగ మార్చి ఆత్మోద్దీపనమున కాలంబనములుగ గావించుకొనును. పాశవిక శక్తిని దైవిక శక్తిగ మార్చును.

పవిత్రత లేని దేశమున వేదములుగాని, ఉపనిషత్తులు గాని, గీతలుగాని ఉద్భవిల్లవు. ఇందువలననే లోకమున 'సాధు హిందువు' అని వాడుకకూడ నేర్పడినది. ఈతడు తనచుట్టునుండు మానవులతోడనేగాక పశుపక్షి క్రిమి కీటకాదులతో - సకల జీవులతో - వస్తుసముదాయముతో సమరస భావ మేర్పరచు కొనును. ఈ సమరసభావము స్నేహమును బెంపొందించును. సదాలోచనములను బ్రబల జేయును. సదాలోచనములు సత్కార్యములను బ్రేరే పించును. ప్రకృతియందలి నిఖిల వస్తుసముదాయముతో, జీవులతో నిరంతర సద్భావముతో మైత్రి గావించుకొను టయే భారతీయుని లక్ష్యము.

భారతదేశమున పెక్కు-భాషలు, తెగలు, మతములు గలవు. ఈ భిన్నత్వమునందు ఏకత్వమును గాంచుటయే భారతీయుని లక్ష్యము. ఇదియే భారతీయుని విజ్ఞాన వికాసమార్గము, హృదయవికాసపద్ధతి. ఈరహస్యమును భారతీయులతో పరిచయముగలవారు బాగుగ గమనింప గలరు. వివిధ దేవతలందు నొకే పరబ్రహ్మమును భార తీయుడు గాంచును. వేదకాలమునుండి నేటికిని నిది పరంపరగ వచ్చుచున్నది. నిశ్చలత్వమును, తీవ్రతమ చల నమును స్థూలదృష్టికి దుల్యములయ్యును గతివిషయమున

గమభిన్నములు. పరమమూర్ఖుడును, పరిపూర్ణ జ్ఞానియు బాహ్యరూపమున సమానముగ గన్పింపవచ్చును. కాని వీరి తారతమ్యము మాత్రము విపరీతముగాదా ?

మానవుని యాంతరంగిక సౌష్ఠవమును, ఆత్మ వికాసమును గాంచినపుడే భిన్నత్వమును ప్రేమించి యందలి యేకత్వమును గమనింపగలము. ఏకరీతిగనుండు సమానాకృతులందు అందమెక్కడిది ? పాశ్చాత్యుల నాగరికత, విజ్ఞానము, కళ, సర్వాభివృద్ధియు నిట్టి సమానత్వమునే ప్రదర్శించును. ఇందందముగాని, మానసిక వికాసముగాని గన్పింపదు. దీనిని భారతదేశము హర్షించి స్వీకరించుట కల్ల.

# భారతీయుల నిత్యజీవిత విధానము

మానవ జన్మము బహుదుర్లభము. ఎన్నియో జన్మములు పశుపక్ష్యాది తిర్యగ్యోనుల కలిగినమీదగాని మనుష్య జన్మము లభింపదని భారత శాస్త్రములు పేర్కొనుచున్నవి. ప్రపంచమును శాసించు సర్వశక్తులును మానవ దేహమున సూక్ష్మరూపమును దాల్చి గుప్తమై యున్నవి. మానవ శరీరమునుగూర్చి విపుల పరిశోధనలు ప్రశంసలు భారత శాస్త్రవేత్తలు గావించిరి. కేవలము అస్థి పంజర నిర్మాణమును, చర్మపు పొరల విషయము లును దెలిసినంతమాత్రమున శారీరిక శాస్త్రము దెలియునని చెప్పజనదు. ఇందెన్నియో సూక్ష్మవిషయములు, తత్వములు లీనమై - పెనవైచుకొని యున్నవి. "శరీర మాద్యమ్ ఖలు ధర్మసాధనమ్"అని పూర్వులుకీర్తించిరి. వారు సౌష్ఠవములగు నాహార విహారముల యాధారము లతో పరిశీలనలు గావించి, శాంత జీవితమును గడపి యానందము ననుభవించిరి. నేడు ప్రతివారు నశాంతి మధ్యమున - నగ్ని పర్వతములపై నివసించి దుఃఖమును, సంక్షోభమును జెందుచున్నారు. మన కబ్బిన యీ యమూల్య జీవితమును శాంతియుతముగ-సుఖవంతముగ-

గావించుకొనజాలమా? శరీరమందలి యాంతరంగికోన్నత శక్తుల యనుభూతియే జీవితమునకు విలక్షణత నొసగి శాంతిని జేకూర్చును. నేడు శాంతిని గూర్చిన మాటల సందడి విశేషముగ గలదుగాని దానిని జేకూర్చు సుస్థిరాధారముల నిర్మాణమునకు చేయు ప్రయత్నములు మృగ్యము. అంతియకాదు. తద్వ్యతిరేక శక్తులును తాండవ మాడుచున్నవి.

మనుజుడు ఆహార విహార నియమములు బాగుగ పాలించి తృప్తి బడయవలెను. ఇది మొదటి ధర్మము. భారతీయుల సంస్కృతి నాగరికతలకిదియే మూలకందము. చక్కని బ్రహ్మచర్యము, శుచి యగు మితాహారములే సుఖ జీవనమును జేకూర్చును. శరీరమునకు పుష్టిని, తుష్టిని జేకూర్చి మానసిక వికాశమును, ఆత్మోద్దీపనమును గావించును. నేటి యువకులకు నిగ్రహములేని స్వేచ్ఛా విహారము, తుష్టిని పుష్టిని కలిగింపని వివిధాహారములే నిత్య జీవనాధారములైనవి.

పుస్తకపఠన మొనర్చుచు, గంభీరోపన్యాసముల నొసగి వాదోపవాదములు, తీవ్ర విమర్శనములు గావించుచు విద్యాధికులమని విర్రవీగినను, అధికారులమని యహంకరించినను, దళారి బేరములు గావించుచు ధనవంతులయి బొర్రలు పెంచినను, ఆహార విహార విషయములందు

నియమ నిగ్రహముల బాటింపనిచో జీవితమున శాంతి గాని, సుఖముగాని పడయజాలరు.

ప్రాచీనులు బ్రహ్మచర్యమును తమ జీవితమున కంతటికి కేంద్రముగ - పునాదిరాయిగ గావించి యద్దానిని కడుంగడు శ్రద్ధతో పాటించి పాలించిరి. భారతీయ వర్ణాశ్రమములందిది ప్రథమస్థానము నాక్రమించినది. బాలమున-విద్యార్థి దశయందు ప్రతివ్యక్తియు నిర్మల బ్రహ్మచర్యము నవలంబింపవలెను. ఇది లేనిదే విద్యాప్రబోధము గాని, విద్యాభ్యాసముగాని లేదు. యువకుడై, విద్యను పూర్తిచేయువఱకు మనోవాక్కాయములందు అష్టదోషరహిత బ్రహ్మచర్యమును బూర్తిగ నవలంబించి యాచరింపవలెను. స్త్రీని స్మరించుట, కీర్తించుట, ఆటలాడుట, చూచుట, రహస్యముగ మాటలాడుట, తలంచుట, నిశ్చయించుట, సంభోగము అను నెనిమిదియు దోషములే. ('స్మరణమ్, కీర్తనమ్, కేలిః, ప్రేక్షణమ్, గుహ్యభాషణమ్, సంకల్పోఽధ్యవసాయశ్చ, క్రియానిష్పత్తిరేవచ') బ్రహ్మచర్యము లేనిచో నాధ్యాత్మికాభివృద్ధినేగాక, కేవల నిత్యజీవితాభివద్ధినైన గాంచుట కవకాశమే లేదు. వేదఋషులు దీనిని పాలించి, మంత్రద్రష్టలై ముక్తిగాంచిరి. ప్రాచీనార్య సంతతికి జెందిన

ప్రతివాడు దీనిని పాలించితీరవలసినదే. శక్తిని బడయవలె నన్న బ్రహ్మచర్య మవసరము.

మనోవాక్కాయ కర్మలతో నెల్ల యవస్థలయందు సంభోగమును వీడుటయే బ్రహ్మచర్యము. (కాయేన మనసా వాచా సర్వావస్థాసు సర్వదా సర్వత్ర మైథున త్యాగమ్ బ్రహ్మచర్యమ్ ప్రచక్ష్యతే') —యాజ్ఞవల్క్యుడు.

బ్రహ్మచర్యపాలనము నాలుగు వేదములు చదివినంతఫలము నిచ్చును. ('ఏకతశ్చతురోవేదాః బ్రహ్మచర్యం తథైకతః'),

శక్తిలేనివాడే కార్యమునగాని సఫలీకృతుడుగాజాలడు. శక్తిలేనివానినెల్లరుహీనునిగ నేజూతురుగానిగౌరవింపరు. ఆత్మయు దుర్బలునికి లభ్యముగాదు. ("నాయమాత్మా బలహీనేనలభ్యతే" ...శ్రుతి.) శీలసంపత్తికి నిదియే ప్రధానము. ఇంద్రియ నిగ్రహము బ్రహ్మచర్య మనబడును. ఈ యింద్రియ నిగ్రహమునుండియే సర్వశక్తులు నుద్భవిల్లుచున్నవి. ఓజస్సే సర్వశక్తులకు మూలము. వీర్యము నిశ్చలతజెంది, బిందురూపమునుదాల్చినగాని ధారణాశక్తి గలుగజాలదు. ఈశక్తిలేనిదే కన్ను కాంచజాలదు. చెవి యాలకింపజాలదు. మనస్సు పనిచేయజాలదు. బుద్ధి నిర్ణయింపజాలదు. ఒక్క బిందుపతనము ప్రపంచమున నొక నూతనజీవిని సృష్టించుచున్నది. దాని నిగ్రహము

మోక్షము నొసగుచున్నది. ('మరణం బిందుపాతేన జీవితం బిందు ధారణాత్')

శాంతిని, కాంతిని, స్మృతిని, జ్ఞానమును, ఆరోగ్యమును, మంచిసంతతిని కోరువారు బ్రహ్మచర్యమును పాలింపవలయును. ('శాంతిం కాంతిం స్మృతిం జ్ఞానం ఆరోగ్యం చాపి సంతతిం యశ్చేచ్ఛతి మహాద్ధర్మం బ్రహ్మచర్యం చరేదిహ') —ధన్వంతరి.

ఇంద్రియనిశ్చలత, ఊర్ధ్వ రేతస్కత లే ఆత్మోద్దీపనమును జేకూర్చునవి. ఇందువలననే 'విద్యార్థి దశయందు పరిపూర్ణ బ్రహ్మచర్యముతోబాటు గృహస్థాశ్రమమున గూడ ద్వితీయ బ్రహ్మచర్యమును విధిగ నియమించిరి. సంతానమును బడయుటకును, ధర్మార్థములను సాధించుటకు మాత్రమే స్త్రీ పురుషుల సాంగిత్యమును విధించిరి గాని కేవల కామతృష్ణను దీర్చుకొనుటకు మాత్రమే గాదు. కామి ఆర్యసంతతికి జెందినవాడు గాడనియే మన పూర్వుల స్థిరాభిప్రాయము.

నవీన నాగరికతా వ్యామోహ పరవశులు బ్రహ్మచర్యమును అసంభవమనియు, నసహజమనియు భావించుట విచారకరము. 'బ్రహ్మచర్య మస్వాభావికము. దాని నవలంబించువారికి బెక్కుజాడ్యములుగూడ గలుగును' అని

వాదింతురు. ఇట్లు వాదించువారికి బ్రహ్మచర్యమన నేమియో తెలియదనియు, వారందలి సౌష్ఠవసౌభాగ్యములు గ్రహింపజాలరనియు చెప్పగలము. కేవలము స్త్రీ సంభోగమే మైథునముగాదు. పైన పేర్కొనిన యష్టవిధములగు మైథునములు విసర్జించుటయే బ్రహ్మచర్యము. స్త్రీ పురుషులు-ముఖ్యముగ యువతీయువకులు - ఏకాంత విలాసములు గావించుచో కామోద్రేకమునకు గురిగాక మానరు. నవీనుల స్వేచ్ఛావిహారములు బ్రహ్మచర్య నాశమునకు దారితీయును. నేటి మనయువకులు నూటికి ఎనుబదిమంది ప్రమేహవ్యాధులకు గురియగుట విచారకరము. వీరియందింద్రియపటుత్వము, దృఢత గానరాదు. ఉద్రేకము వీరికింద్రియ పతనము గావించుచున్నది. ఇట్టివారి సంతానము దుర్బలమై, మనోనిగ్రహ శూన్యమై శరీర వ్యాధులకు, మానసిక చంచలత్వమునకు గురిగాక యేమగును? అందువలననే స్వకీయాభివృద్ధియందు పెక్కురకు గాఢమగు విశ్వాసముగాని, ప్రయత్నముగాని, పట్టుదలగాని కానరాదు. అంతియగాక యనేకులల్పాయుష్కులై భూలోకమును వీడవలసిన వారగుచున్నారు.

నేడు లోకమున సంతాన నిరోధ తాపత్రయము ప్రబలినది. పెక్కురు శాస్త్రవేత్తలు దీనిని శాస్త్రసమ్మ

త్రముగ వాదించుటయు, ఆర్థిక వేత్తలనువారు దారిద్ర్య నిర్మూలనసాధనముగ ప్రదర్శించుటయు విచారకరము. ఇది దుర్బలులు, కామతృష్ణాపరులు గావించు వాదనయనియే నాభావము. నగ్నచిత్రములు, సినిమా యందలి నగ్న ప్రదర్శనములు, స్త్రీ పురుషుల కామ విహారముల ప్రకటనములు నేడు ప్రబలినవి. ఇవియెల్ల కామతృష్ణను, ఉద్రేకమును బెంపొందించునేగాని జాతికి పటుత్వమును, ఔన్నత్యమును జేకూర్పగలవా ? నవీన నాగరికులు అదుపు లేని స్వేచ్ఛావిహారులైరి. ప్రాచీనుల శరీర సౌష్ఠవము, మానసిక వికాసము నేడు భ్రష్టత గాంచినవి. ప్రాచీనులందు గర్వింపదగిన బ్రహ్మచర్య శక్తుల సౌష్ఠవ వికాసములు నేడు నామమాత్రములైనవి. నేటి యువకులందు ధీశక్తి, మనోనిగ్రహములు శూన్యములు. నిశ్చలత, శాంతి నశించినవి. కార్యదక్షత లేదు. ఉద్రేకావేశములు పెచ్చు పెరిగినవి. నిరాశ, అపజయములు తాండవమాడుచున్నవి. కష్టసహిష్ణుత లేదు. సంకల్పము సన్నగిల్లినది. వీరు కేవలము దుర్బలులగు బానిసలసృష్టించుయంత్రములుగనున్నారు. పరులు తమ్మెవ్వరైనను అవమానించి యవమానాపకారములను గురి గావించుచున్నను, దానికి ప్రతిక్రియ గావించు మనోభావముగాని, సమాధాన మొసగు ధైర్యసాహసములు

గాని వీరికి లేవు. అవమానముల నందుకొని యాహ్వానించుటయే యీ దుర్బలజాతికి ప్రకృతియయినది.

ఇక నేటి మన నిరంతర ప్రయాణములు గాంచుడు. రైళ్లలో, మోటారులలో గావించు తీవ్ర సంచారములు గాంచుడు. నరముల గదలించి, సడలించి యలసటను, ఆయాసమును, నిరుత్సాహమును బెంపొందించి శీఘ్ర మరణమునకు దారిదీయుచున్నవి. ఇందువలన జీవిత నిర్వాహణమునకు నిత్యము పోరాటము గావించు శక్తికూడ లేక దరిద్రులై, శుష్కించి మరణించుచున్నారు.

ఇక నాహారవిషయము నాలోచింపుడు. ఆహార శుద్ధి యున్నయెడల నిర్మల బలముగలుగును. ("ఆహారశుద్ధౌ సత్వశుద్ధిః") యుక్తములగు నాహార విహారములు గలవానికే దుఃఖ నాశకమగుయోగము లభించునని భగవద్గీత చెప్పుచున్నది. ("యుక్తాహారవిహారస్య యోగోభవతి దుఃఖహా") కావున మన శరీరమునకు పుష్టిని, తుష్టిని జేకూర్చి సౌష్ఠవ వికాసముల నొసగు శుభ్రమగు నాహారము మన కవసరము. శారీరిక సౌష్ఠవ నిర్మాణ నియమములే యాధ్యాత్మిక వికాసమునకు దారిదీయును. మనము భుజించు నాహారము, త్రాగు నీరు, పీల్చు గాలి వీనినుండి సారమును స్వీకరించి యన్నమయ కోశము పోషింపబడుచున్నది.

మరియు మన చుట్టునుండు జీవులనుండి వెలువడు సూక్ష్మాణువులుగూడ దీనికి తోడ్పడును. మన శరీరములు నిర్జీవపదార్థములనుండి సృష్టింపబడలేదు; పోషింపబడజాలవు. ప్రతి పదార్థమునందును నిగూఢ జీవశక్తులున్నవనియు, జీవకణములేని పదార్థము లేనే లేదనియు భారతీయుల శాస్త్రనిర్ణయమును, దృఢవిశ్వాసమును గూడ. పదార్థము జీవాణువుల కలయికయే. ఒక స్వల్ప రజఃకణము పెక్కు సూక్ష్మజీవుల కూడికయే. ఒక రజఃకణమును 'దూరదర్శిని'తో బరీక్షించిన నందు బెక్కు సూక్ష్మజీవులుగన్పించును. మన శరీరమిట్టివాని సమ్మేళనమే. మననుండి సర్వదా యిట్టి సూక్ష్మజీవులను బయటికి విడచుచుందుము. లోపలికి స్వీకరించుచుందుము. మన మారోగ్యమును వాంఛించుచు, శుభ్రమగు జీవాణువులను స్వీకరించుచు నశుభ్రములగుజీవాణువులను వెలికిబంపవలెను. మనము స్వీకరించు సర్వము శుచిగ, శుభ్రముగ, చైతన్యవంతముగ నుండవలె ననునదే భారతీయుల విశ్వాసము.

సర్వాణువులు జీవిత చైతన్య వికాసములజెంది క్రమముగ నశించుట ప్రకృతి నియమము. ప్రతిది నిర్మాణావస్థను జెంది క్రమముగ శిథిలమగును. శుభ్రమగు నాహారమన: జీవాణువులు గలిగిన - వికాసమును - అభివృద్ధిని

ఈయగలిగిన యణువుల సమూహామేగదా! లేత యాకులు, కూరగాయలు, పండినపండ్లు, పక్వమైన గింజలు, దుంపలు మున్నగువానికి ప్రాణమును, జీవిత వికాసమును నుండును. వీనిని భుజించిన మన శరీరము గూడ జీవిత వికాసాభివృద్ధుల బడయును. ఇట్టివి వాడి నను, ఎండినను, క్రుళ్లినను వానియందలి జీవితము నశించునుగాన నా యాహార మశుభ్రత జెందును. ఇట్టి చచ్చుపదార్థములు జీవితమును నిర్మింపజాలవు.

మాంసము చచ్చినజంతువులనుండి లభించుపదార్థము. వాని ప్రాణము పోయిన వెంటనే యిది నిర్జీన పదార్థ మగును. కనుకనే కొలది కాలమునకే క్రుళ్లి దుర్వాసన గొట్టును. కావున శిథిలావస్థ నందును. కాబట్టి మాంసా హారము జీవిత నిర్మాణమునుగాని, వికాసమునుగాని కలి గింపజాలదు. కందమూలములు, శాకఫలములు మున్నగు వానివలె మాంసాహారము శరీర జీవిత వికాసము నొసగ జాలదు. మాంసాహారమున నిర్మాణశక్తిగాని, జీవిత ముగాని లేదు గాన నద్దానిని భుజించువారు శీఘ్రముగ వ్యాధులకు గురియగుదురు. దీనిని భుజించిన గాయములు త్వరగ మానవు. జ్వరతీవ్రతయు శీఘ్రముగ నెక్కువగును.

ఇదేవిధముగ నిర్మల ద్రవపదార్థములును, శుభ్రమగు నీరమును ఆరోగ్యమును జేకూర్చును. పాలలో జీవకణ

ములు విరివిగ గలవు. కాన శరీర నిర్మాణమునకు, పుష్టికి నివి మెండుగ దోడ్పడును. మాగిన ద్రవములు అనారోగ్యకరములు. సారాయములు, మద్యరసము లిట్టివి గాన నివి శరీరమునకు హానిగావించును. వీని ద్రవము మాగి జీవకణములను నశింప జేయును. ఇది మనస్సును మాంద్యపఱచును. బుద్ధివికాసమునకు విషముపెట్టును. వేడి దేశములలో నివి మఱింత వేగముగ జీవిత నాశన మొనర్చును.

శుభ్రమగు గాలిలో ప్రాణవాయు వుండును. మనము విడుచుగాలిలో బొగ్గుపులుసుగాలి యుండును గాన దానిని దూరముగ వెడల గొట్టుటకు విస్తారమగు వాయువు లేక-మరల దానినే పీల్చిన ననారోగ్య మేర్పడును. ఇంతియ గాక వెలుపలికి విడిచినగాలిలో చచ్చిన కణములుండును. వీనినే మరల పీల్చిన నవి మన శరీరమునకు హాని జేకూర్చును.

నేటి మన యాహారమును గాంచుడు. ఇది యారోగ్యకరమైనది గాదు. జీవకణములతో శరీరనిర్మాణమును గావించునదిగాని, పుష్టిని జేకూర్చునదిగాని కాదు. నేడు మనము విచ్చలవిడిగ భుజించు నాహార మశాస్త్రీయము. యంత్రములలో తయారైన తెల్లని బియ్యమును నేటి

నాగరికు లనువారు విరివిగ వాడుచున్నారు. యంత్రపు టొరపిడిచే నందలి జీవాణువులు నశించుచున్నవి. పుష్టి నొసగెడు పదార్థములలోని సున్నము, భాస్వరము, మాంసకృత్తులు మున్నగు వాని నీ యంత్రములు లాగి వైచి పిప్పిని మాత్ర మొసగుచున్నవి. వీనిని భుజించుట చేతనే కాలి తీపులు, ఒడలి నొప్పులు, పొట్టలు పెరుగుట మున్నగు వ్యాధులు దేశమున ప్రబలినవి.

జావాపంచదార తెల్లగ కంటి కింపుగ నుండును గాన నిండుగ ప్రేమించి మెండుగ వాడుదుము. ఇది వెదురు, చెఱకుల సంయోగముచే నేర్పడిన సంకరజాతి చెఱకుగడది. ఈ చెఱకు రసమును శుభ్రపఱచుటలో పటిక, సున్నము, నీలిమందులు విశేషముగ వాడబడుచున్నవి. ఇవియు జీవాణువుల నాశ మొనర్చు పదార్థములే. గడ్డినేయి, కృత్రిమ తైలము, డబ్బాపాలు మున్నగునవి శరీర పటుత్వమును పాడుచేయుచున్నవి. దుర్బలత్వమును త్వరగ జేకూర్చి, జాతి క్షీణతను బెంపొందించుచున్నవి. మనము మంచుగడ్డనుగూడ విరివిగ వాడుచున్నాము. తత్ఫలితముగ దంతముల తీపులు, శీఘ్రముగ నూడిపోవుట జరుగుచున్నవి. గొంతు నొప్పులు ప్రబలుచున్నవి. సోడా, లెమనేడ్ మున్నగు పానీయము లెల్లబొగ్గు ద్రవ సమ్మిళితములే

గదా? ఇవి చేయని యపకారము లేవి? తేయాకు నందలి టానిన్ అను విష పదార్థము విష జ్వరముల ప్రబల జేయును. కాఫీయందలి కాఫిన్ మలబద్ధకమును, మాంద్యమును గలిగించును. పొగబీల్చుట ఫ్యాషనుగ మారినది. తత్ఫలితముగ నూపిరితిత్తుల వ్యాధులు, క్షయ ప్రబలుచున్నవి. మద్యరసము, సారాయము, మాంసాహారములు మానవులను దుర్బలులుగ గావించి, కామ క్రోధముల ప్రబలజేయుచున్నవి. ఇట్లు సర్వవిధముల నేటి యాంగ్ల నాగరికత మనలను నిర్వీర్యులగు బానిసలుగ గావించినది. మైకము జెందిన యవివేకులుగ తయ్యారు చేసినది.

మన వస్త్రములకు వేయు కృత్రిమ వర్ణము లన్నియు వానియందలి శుభ్రతను నాశముచేసి మన శరీరములను పాడుచేయుచున్నవి. మనము ధరించు కాలి జోళ్లు మన కమితముగ నష్టములను గలిగించుచున్నవి. ప్రాచీన భారత జీవితము నొకపరి విలోకింపుడు.

ప్రాచీన ఋషులు ఏ నదీ ప్రాంతములందో కుటీరములు నిర్మించుకొని నివసించిరి. వారు కంద మూల ఫలములు భుజించి పాలు ద్రాగెడివారు. నిర్మలమగు ప్రవాహజలముల స్నానమాడెడువారు. ప్రవాహజలమునే గ్రోలెడివారు. శుభ్ర

మగువాయువును బీల్చుచు పగలెల్ల చెట్లక్రింద కాలక్షేపము గావించెడివారు. పగలు చెట్లు ప్రాణవాయువును విడిచి, బొగ్గుపులుసు వాయువును గ్రహించునుగాన, వీరు బొగ్గుపులుసు వాయువును విడిచి, ప్రాణవాయువును విస్తారముగ బీల్చ నవకాశముండెడిది. రాత్రులు కుటీరములందు నిద్రించెడివారు. వీరు బ్రహ్మచర్య వ్రతమును విధిగ పాలించిరి. ఈ విధముగ నాహార విహారములందు ప్రాచీన భారత జీవితము మాధుర్యమును, ఆరోగ్యమును, క్లుప్తతను గలిగి ఉన్నతమై - శాస్త్రసమ్మతమై - విపుల విశ్రాంతిని, పూర్ణశాంతిని ఇచ్చెడిది. వారు జాతిని పటుత్వవంతముగ - తేజోవంతముగ - నొనర్చి, ధైర్యసాహసముల కాలవాలము గావించిరి. విజ్ఞానమున కాటపట్టుగ జేసిరి. వారి యాలోచనములు ఉన్నతములు. జీవితము క్లుప్తము. ఈసౌష్ఠవమునే గ్రామనిర్మాణమున గాంతుము. వ్యవసాయ వృత్తి, విశాల గృహములు, విహార ప్రాంతములు, ప్రాణశక్తిపూరితాహారము, దంపుడు బియ్యము, కోమలమగు శాకములు, ఆకు కూరలు, శుభ్రమగు పాలు స్వచ్ఛమగు జలము, అనంతమగు శుభ్రవాయువు నెల్లరకు కావలసినంత సర్వదా లభించెడివి.

# నాగరికత యననేమి ?

పాశ్చాత్యులలో గ్రంథకర్తలు, చరిత్రకారులు, శాస్త్రవేత్తలు, మతబోధకులు పెక్కురు పెక్కు విధములగు తమ తమ చిత్తవైఖరి ననుసరించి నాగరికతను బెక్కు-రీతుల నిర్వచించిరి. కాని వీరెల్లరు ప్రాగ్దేశముల వైలక్షణ్యముల గుర్తింపమిలో మాత్ర మేకీభవింతురు. కావున తామెట్లు ప్రవర్తించిననదియే నాగరికతయని వీరిభావము.

"న్యాయము, మానవత్వము, జీవకారుణ్యము, ఇతరుల సమాన దృష్టితో గాంచి గౌరవించుట అనాగరకుల చిహ్నములు."

—క్లైవు బెల్లు.

"ఆంగ్ల క్రైస్తవ మతబోధకులు యూరపునందలి యితర జాతుల చరిత్రల నన్నిటి నీసడించుకొని వారిని క్రైస్తవ మతమున జేర్చుకొనిరి."

—బకిల్.

తమ సాటివారగు ఐరోపీయుల యెడనే యిట్లు ప్రవర్తించిన యాంగ్లేయులు ఇక ప్రాగ్దేశీయులయెడ నెట్లు ప్రవర్తింతురో వేరుగ నుడువవలెనా? వారితరుల సుగుణములను గ్రహించు ప్రయత్నమైన గావింపకయే తమకర్థము గాని వెల్ల అనాగరిక విషయములు, లక్షణములు అని నిర్ణయింపసాహసింతురు. ప్రపంచమందలి సర్వనాగరికత

లను పాశ్చాత్య నాగరికత చుట్టును ప్రదక్షిణము చేయు గ్రహములుగ వీరు భావించిరి.

భిన్న నాగరికతలను వానియందలి గుణములనుబట్టి నిర్ణయించి గౌరవించుట విజ్ఞానుల లక్షణము, ధర్మము. అదృష్టవశమున కొంతమంది పాశ్చాత్యులు తమ దృష్టితో గాక ప్రాగ్దేశీయులను వారి దృష్టితో బరించి ప్రదర్శించుట శుభసూచకము. నాగరికతను దాని ప్రధాన లక్షణము లనుబట్టియే నిర్వచింపవలెను.

నాగరికత యన 'ధర్మమయమగు సక్రమ జీవితవిధానమును, తత్ఫలితములును' అని నుడువవచ్చును.

మానవ శ్రేయస్సును జేకూర్చు ఆదర్శాచరణముల సమ్మేళనమే సంస్కృతి. అనగా జ్ఞానమును కర్మము నైక్య పఱచుటయే గీతాభావము. భౌతిక మానసిక ఆధ్యాత్మిక శక్తుల పూర్ణాచరణ ఫలితమే శ్రేయస్సు. సంస్కృతి పరమావధి స్వాతంత్ర్యసిద్ధి, స్వాతంత్ర్య జీవనము. సర్వేంద్రియముల సన్నిహితాభివృద్ధుల సమిష్టి రూపమే సంస్కృతి యని భావము.

ఋజుమార్గము మానవుని శాంతి ప్రియునిగ గావించి సాంఘిక జీవితము నభివృద్ధికి దెచ్చును. ఈ యభివృద్ధియే ప్రవర్తనమును నిర్ణయించునది. సమానత్వము, ఐక్యము

నున్న తావున నహంకారమునకును, అతిశయమునకును స్థానముండదు. స్నేహ సహనముల బెంపొందించుటయే నాగరికతా విశేషము. ఇదియే సంఘమును సౌష్ఠవముగ నున్నత సోపానమున నధిరోహింప జేయును. 'రక్షణకు, సుఖ జీవనమునకు గావించుకొను నొడంబడికయే స్నేహ' మని థామస్ హాబ్సు మున్నగువారు నుడివిరి. ఈ విధానము విధులకన్నను హక్కులకే యగ్రస్థాన మొసగును. నీతికంటెను రాచటికపు హక్కులకే ప్రాధాన్య మొసగును. ఇది బాహ్యాడంబరముల బ్రబల జేయునే గాని యాంతరంగిక శుద్ధికి తోడ్పడదు. జ్ఞానమును బెంపొందింప వచ్చునుగాని సత్ప్రవర్తనమునకు దారిజూపదు.

'పాశ్చాత్యులది పాశవిక నాగరికత. ప్రాచ్యులది సాంస్కృతిక నాగరికత.' —ఆచార్య యల్. పి. జాక్సు.

పాశవిక నాగరికత ప్రపంచమును దోచుకొని నాశ మొనర్చును. ప్రపంచము నొక చైతన్య రహిత యంత్రముగ భావించి దానిని దోచుకొనును. సాంస్కృతిక నాగరికతయో ప్రపంచమును చైతన్య స్వరూపముగ భావించి, మానవాభివృద్ధికి దోహద మొసగుచు నద్దానిని ప్రేరేచి పూజింపజేయును.

పాశ్చాత్య నాగరికత ప్రేయమును, ప్రాచ్యనాగరికత శ్రేయమును బెంపొందించును. ప్రేయము ప్రపంచమును సర్వదా పీల్చి, పిప్పిచేసి యనుభవింపజేయును. ఇది అసురశక్తిని ప్రబలజేసి, స్వార్థమును, ఈర్ష్యాద్వేషములను ప్రజ్వలింపజేయును. భోగమును బెంపొందించును. ప్రపంచమునంతటిని కబళింప జూచును. శ్రేయమో! ప్రపంచమును ప్రేమించి వికసింపజేయును. మానవునద్దానితో గూడివిహరింపజేయును. స్వార్థమునుమరపించి, అన్యోన్యప్రేమను బెంపొందించి త్యాగసంపద నభివృద్ధికి దెచ్చును. ఆధ్యాత్మిక శక్తులను వికసింపజేయును.

ప్రాచీనకాలమునుండియు భారతనాగరికత అంతరంగిక వికాసమునకు దోహద మొసగి, స్వార్థమునకు స్వస్తిచెప్పి పరమార్థమునకు ప్రాధాన్య మొసగెను. మానవుడు పాపిగాక పవిత్రుడు, సన్మార్గు డనియే భారతీయుల భావము. అప్పుడప్పుడజ్ఞానావరణముచే స్వార్థము ప్రకోపించినను, నద్దానిని త్రోసివైచి, వారుసౌహార్దమునే ప్రబలజేయ బద్ధకంకణులైరి. ఆత్మయందు సర్వభూతములను, సర్వభూతములందు ఆత్మను గాంచువాడు ఎవ్వరిని ద్వేషించును? విద్యావిహీనుడుగ భావింపబడు సామాన్య భారతీయునకుగూడ సత్యము నిత్యాచారగతము. భార

తీయుడు హక్కులకు ప్రాకులాడక నిజధర్మనిర్వహణము నకె నిరంతరకృషి గావించును. కావుననే రాజకీయాధి కారముకన్న నీతియే వీరి జీవితమున విస్తరించినది.

నాగరికతను ఫలితమని నుడివితిమి. పాశ్చాత్త్యుల నాగరికత భోగముల ననుభవించుటయే. కాన వారు భాగ్య భోగ్యములకు బ్రాకులాడి, పరులను విచ్చలవిడిగ కొల్ల గొట్టి, దోచుకొని యనుభవించుటయే నాగరికతాభివృద్ధిగ గణించిరి. శరీరమందలి సర్వావయవములు పరస్పర సహా కారము గావించుకొనునట్లే నాగరికతయందలి వివిధాంశ ములు పరస్పరానుకూలముగ నుండవలెను. వ్యవసా యము, వాణిజ్యము, లలితకళలు, శాస్త్రములు, మతము మున్నగునవి నాగరికతకు ప్రధానాంగములు. వీనిలో వివిధ శాఖ లుండవచ్చును.

"నాగరికత భౌతిక వస్తురాశి గాదు. ఆర్థికసంపదయు గాదు. సైనికబలమును, సామ్రాజ్య విస్తరణమునుగూడ గాదు. కేవల పుస్తకపఠనమును గాదు. గొప్ప శాస్త్ర వేత్తలు అనాగరికులవలె దోచవచ్చును. అయోమార్గ ములు, విమానములు, సముద్రపు రేవులు, నావలు నాగ రిక జీవితమునకు సంబద్ధములు గావు."

—హెన్ డ్రిక్ విలియమ్ వేన్ లూడ్.

పైన బేర్కొనిన సంపదలు నాగరికతయందు ప్రత్యేక స్థానమును - ప్రాధాన్యమును బడయవచ్చునుగాని యివి లేని వారనాగరికులని నుడువుట యవివేకము.

కృషి, వ్యాపారములు నాగరికతకు ప్రధానాంగములై నంతమాత్రమున 'వ్యవసాయనాగరకత', 'వ్యాపారనాగరకత' యని చెప్పము. శరీరమునకు సర్వాంగము లవసరమయినంతమాత్రమున 'ముక్కుమనిషి', 'పొట్టమనిషి,' 'కాలిమనిషి'అని నుడువుట హాస్యాస్పదముగాదా! శరీరమందలి అవయవములవలెనే సక్రమమగు ప్రధాన లక్షణముల పొందికయే నాగరికత. ఈలక్షణములలో నెద్దానినైన బలవంతముగ నితరులపై నంటగట్టిన నది వారియందిముడక వికారరూపమును దాల్చును. పరుల లక్షణములు మనయందు చక్కని పొందికతో నందముగ నిమిడినప్పుడే వానిని స్వీకరింపవలెను. భిన్ననాగరికతల క్రమమగు పొందికయే జీవితవికాసము. దగ్గర పోలికలుగల జాతి చెట్లకంటు గట్టవచ్చును గాని మామిడికిని, మఱ్ఱికిని అంటు గట్టవచ్చునా? ఒకే యాదర్శముగానీ, దానికి సన్నిహిత సంబంధముగానీ గల జాతుల నాగరికతల కలయికకవకాశము గలదుగాని వ్యతిరేకాదర్శములుగల నాగరికతల నొకరిపై నొకరు బలవంతముగ నంటగట్టజనదు. అట్లు గావించిన వికృతఫలితములే లభించును.

భారత నాగరికతకు ఉదాత్తాశయములు, ఉన్నతాదర్శములు ప్రత్యేక లక్షణములు. ఇందలి సర్వాంగములీదేశమునందే యుద్భవిల్లెను. పరలక్షణములు తనయందు క్రమముగ నిముడినపుడు వాని నలంకారములుగ స్వీకరించెను. దురదృష్టవశమున పరులు పెక్కురీ దేశముపై క్రూరములగు దాడులుగావించిరి. మననాగరికతను భగ్నమొనర్ప పెక్కు క్రూరకృత్యములు గావించిరి. తమ నాగరికతను బలవంతముగ నంటగట్టు దుష్టమార్గముల నవలంబించిరి. కాని భారత నాగరికతలో ప్రత్యంగమునను శక్తిమంతమగు చైతన్య ముండుటచే నిట్టి ప్రయత్నములెల్ల భగ్నమాయెను. నేటికి నిది తన ప్రాచీన ప్రాభవమును బ్రదర్శించుచునే యున్నది.

పాశ్చాత్యులకు ప్రాచీనతగాని, ప్రాచీన వస్తువులు గాని పనికిరావు. సర్వదా నూతన వస్తు విషయములు వాంఛింతురు. నూతనోత్పత్తులు, ప్రదర్శనములు గావించి సంతతముమార్పులు వాంఛింతురు. వీరికీమార్పేయభివృద్ధి. 'అభివృద్ధియన ముందునకునడచుట. క్షీణత యన వెనుకకు బోవుట యని, వెనుకకుబోవుటయన గతకాలమునందువలె జీవించుట యని, గతమును ద్రోసిపుచ్చి మార్పును వాంఛించుటయే సరియనియు' పాశ్చాత్యుల మానసిక తత్త్వము. వీరి శాస్త్రజ్ఞానము, కళాభివృద్ధి దీనినే ప్రదర్శించును.

'భారతీయులు తమ ప్రాచీన వైభవములను, ప్రాచీన జ్ఞానసంపదను గుర్తించి వానిని తమ జీవితమున జీర్ణించుకొనుచున్నారు గాన వీరనాగరికులు. వీరికి నాగరకలక్షణములున్నచో మార్పు నేల వాంఛింపరు?' అని కొందరు పాశ్చాత్యులు వాదింతురు. కాని భారతీయులు ఈ పరిణామము తాత్కాలిక మనియు, క్షణభంగుర మనియు భావింతురు. 'పశుబలమే యోగ్యము' అను భావముతో పాశ్చాత్యులు నేడు ప్రపంచమున ప్రబలిరి గాన నదియే యభివృద్ధి యని వా రనుకొనవచ్చును.

'పశుబలమే యీ ప్రపంచమును పాలించుచున్నది. ఇక ముందును సర్వకాలము పాలించుచుండు ననుట నిస్సంశయము. సాధుత్వము వట్టి దుర్బలత్వము. పశుబలము విజయవంతము.' —ఓ. లెఫ్ రాజు.

'నేనే మానవుడను. నేనే సర్వమును' అను నహంకారము వీరియందు ప్రబలినది. కండ నాశ్రయించినది కావరముగాని కారుణ్యముగాదు. స్వార్థద్వేషములు విష వాయువులను, మారణయంత్రములను ప్రపంచ వాతావరణమున విచ్చలవిడిగ విరజిమ్ముచున్నవి. మనసునందలి సెగలే మహాసంగ్రామములందును, వ్యాపారములందును బగ బగ మండుచున్నవి. ఆర్థిక రాజకీయ సాంఘిక

జీవితములందు వికృత నృత్యములు గావించుచున్నవి. స్వార్థపరత్వము విలాసవ్యామోహములకు వింజామరలు వీచుచున్నది. దుర్వృత్తులన్నియు చేతులుగలిపి గజ్జెగట్టి నాట్యమాడుచున్నవి. ఇంద్రియములు పగ్గములు త్రెంచుకొని, యాత్మను వెనుకకునెట్టి విచ్చలవిడిగ పరుగు లిడుచున్నవి. స్వేచ్ఛాప్రవర్తనము స్వాతంత్ర్యముగాదు. గత ఐరోపా మహాసంగ్రామమును, నేటి ప్రపంచ సంగ్రామమును నిందులకు ప్రబల నిదర్శనములు. ఈభీకర యుద్ధములు ఏక మతస్థు లందే ప్రబలి ప్రపంచమును బ్రద్దలు గావించుచున్నవి. సదాశయములను నేలగూల్చి, భ్రాతృత్వమును, సౌహార్దమును ప్రబోధించు ధర్మమును వెక్కిరించుచు తాము ప్రపంచ స్వాతంత్ర్యమునకు పోరాడుచుంటిమని పలుకుట వదరుబోతుతనమునే ప్రదర్శించును. పాశ్చాత్యులలో కొలదిమందికి జ్ఞానవికాసము గలిగినది. వారు మన యాదర్శసంపదను గ్రహింపగలుగుట శుభసూచకము. 'అహింసా పరమోధర్మః' 'సత్యం వద' 'ధర్మంచర', 'స్వస్తి ప్రజాభ్యః' అను హితబోధముల శరణు చొరవలదా? పాశ్చాత్యు లాదరించు క్రూర మారణ యుద్ధములకన్న నాత్మశాంతిని జేకూర్చు సత్యాహింస లానంద దాయకములని ధ్రువపడుట లేదా? ఎగురుపాటు జీవిత మధోగతి కీడ్చుననియు, శాంతి జీవిత మభి

వృద్ధికి దెచ్చుననియు వేఱుగ ననుకొనవలెనా? అభివృద్ధి యన మార్పుగాదే? ఏక ధాటిగ నున్నతికి బ్రవహించు ఋజువర్తనమే అభివృద్ధి. విడబాటుగానీ, అతుకులుకానీ వట్టి పందెపుపరుగుగానీ అభివృద్ధిని జూపజాలవు గదా? "కేవల పరివర్తనము మాత్ర మభివృద్ధిగాదు. ఏకాగ్రత, క్రమదృష్టియే అభివృద్ధి. ఏకాగ్రత ఉత్పత్తి స్థానమును, క్రమదృష్టి ఆదర్శమును బ్రకటించును. ఉత్పత్తిస్థానమే ప్రజల యాత్మ. ఆదర్శమే యాత్మానుభూతి. క్రమదృష్టి యాదర్శముచేతనే నిర్ణయింపబడవలెను. అభివృద్ధి యన నాయాదర్శమునందుకొనుట కాదిశకు జరుగుగమనము."

—ధీరేంద్రనాథరాయి.

మార్పు జీవితమునకు కలవరపఱచి కల్లోలములను గావించును. అభివృద్ధి జీవితమునకు స్థాయినొసగి శాంతిని జేకూర్చును. సంఘమునకు శాంతి నొసగునదే యభివృద్ధి. విచక్షణలేని పరిణామ పరంపరల వాంఛించుట యసంతృప్తిని ప్రబలజేయును. నిర్మాణవంతమగు స్థాయియే యభివృద్ధి. ఈదృష్టితో జూచుచో పాశ్చాత్య నాగరికత కింకను నిలుకడ చిక్కలేదు. వీరి చర్య లింకను బాల్య చేష్టలే. వీరి వాదన లింకను వాచాలత్వములే.

ప్రతి నాగరికతయు కొన్ని ప్రత్యేక లక్షణములతో విరాజిల్లును. శరీరమందలి యవయవములవలె, నీ లక్షణ

ములు క్రమస్థానమునుండి, నిర్ణీతధర్మములు నిర్వహించు నపుడే నాగరికత వికాసమును గాంచును. పాశ్చాత్య నాగరికతకు జన్మస్థాన మొక ప్రాంతమని లేదు. వారిసొంత మేదో పరులదెద్దియో గ్రహింప నం దవకాశము లేదు.

"గ్రీకుల నాటినుండియు పాశ్చాత్యనాగరికత పరుల నుండి యరువుగొని తెచ్చుకొన్నదే. వీరి జీవితపు పునాదులు, వీని ప్రధాన లక్షణము లన్నియు పరులవేగాని స్వకీయములుగావు." —డాక్టరు జాన్ మ్యాకే.

గ్రీకులనుండి కళలను, శాస్త్రములను, హెబ్రూలనుండి నీతిశాస్త్రమును, వివిధ దేశములనుండి, వివిధ జాతుల నుండి వివిధవిషయములను పాశ్చాత్య నాగరికత గైకొనెను. గ్రీకుల శాస్త్రకళల దృక్పథము క్రైస్తవ నైతిక సిద్ధాంతములకు విరుద్ధము. గ్రీకుతత్త్వము హెబ్రూల మత సిద్ధాంతమునకు విరుద్ధము. పరస్పర సామరస్యము లేని భిన్నజాతుల భిన్నలక్షణముల రాశియే పాశ్చాత్య నాగరికత. కావుననే వీరి జీవితమున వివిధ విషయములు వివిధములగు కట్టడములుగ గాన్పించుచున్నవి. కళ, శాస్త్రము, నీతి, మతము, రాజకీయము ఒకదానినుండి వేరొకటి విడిపోయినవి. తత్ఫలితముగ నిర్మాణవంతమగు అంగసౌష్ఠవమునుగాని, ఆంతరంగిక సామరస్యమునుగాని

ప్రదర్శింపలేకపోయెను. అభివృద్ధి యన నున్నతాదర్శము గల యేకధారా ప్రవాహము. ఈ ప్రవాహమున కెచటనైన నొక యుత్పత్తిస్థానముండవలెను. పాశ్చాత్య నాగరికత కిట్టి జన్మస్థానమెద్ది ? గ్రీకులు, రోమనులు, హెబ్రూలు, అరబ్బులు వీరికి నాగరికతా భిక్షపెట్టిరి. వీనికైనను పరస్పర క్రమవిధానముగానీ, ఐక్యముగానీ లేదు. నాగరికతకు జన్మస్థానము ప్రజలయాత్మ. అందుండి ప్రకటితమై యాదర్శముగ వికసించినపుడే నాగరికతకొక స్వరూపమేర్పడును. వివిధజన్మస్థానములుగలదిగావుననే పాశ్చాత్య నాగరికతా స్వరూపమునకు గానీ, అభివృద్ధికి గానీ ఒక యాదర్శము లేదు. అందువల్లనే వారు వివిధవిధముల జీవితములను గడపుదురు. ఆదర్శమున జూపు విశ్వాసము ఆచరణమున మృగ్యము. భిన్నవిధానము వికృతరూప జీవితమునకు చిహ్నము. ఆదర్శము లేని యభివృద్ధి యర్థరహితము.

శీలము లేని గౌరవము, విజ్ఞానము లేని హేతువాదము, శాంతి లేని భోగము నేటి పాశ్చాత్యనాగరికతకు ప్రధాన లక్షణములు.

నాగరికతయందలి కొన్ని లక్షణములను పాశ్చాత్యుల నభివృద్ధికి దెచ్చినమాట వాస్తవము. భౌతికశాస్త్రము,

వ్యాపారము మున్నగు వానియందు వీరు ప్రావీణ్యమును బడసిరి. కొన్ని శాఖలలో నభివృద్ధి గాంచినంతమాత్ర మున సర్వతోముఖాభివృద్ధి గాంచిరని వాదింపజనదు. శరీరమున కొన్ని యవయవము లభివృద్ధి గాంచినంత మాత్రమున శరీర మభివృద్ధిజెందినట్లా? పై పెచ్చు వికృత రూపము దాల్పదా? పాశ్చాత్త్యుల ప్రకృతి శాస్త్రముల యభివృద్ధి, వ్యాపార విస్తృరత నీతిని, మతమును వెక్కి రించినవి.

"౧౯వ శతాబ్దమున మనము తీవ్రముగ ప్రకృతిశాస్త్రాభి వృద్ధిని గాంచినను దాని స్వాదు ఫలముల బడయుటకు సాంఘికముగ, నైతికముగ అర్హులము గాము. అభివృద్ధి జెందుచున్న నాగరికత దృష్టితోగాని, క్రైస్తవ మత దృష్టితోగాని జూచిన నది యెంతయో గర్హింపదగిన వేళాకోళము." —వాలేసు.

"వ్యాపారమున, రాజకీయమున, కుటుంబజీవితమున, మతజీవితమున, స్వదేశ పరదేశవ్యవహారముల తాండవ మాడుచున్న మన దోపిడి భావము నీతి మతములతోడ యుద్ధ మొనర్చు చున్నది." —ప్రొఫెసర్ ల్యాడ్.

"నేటినికి మనలో బెక్కురు రాతియుగమునకు జెందిన వారే యనుట నిజము." —వేన్ లూడ్.

పాశ్చాత్య నాగరికత వ్యక్తికిగాని, సంఘమునకు గానీ సుస్థిరాంతరంగిక శాంతిని చేకూర్పక, విశ్రాంతి నెఱుగని వికారచేష్టల బ్రకోపింపజేసి యుద్ధములను, స్పర్థలను, దోపిళ్లను ప్రబలజేయుచున్నది. పాశ్చాత్యులు విశ్రాంతి, నిలుకడ నెరుగని నిరంతరకృషి గావించుచుందురు. యంత్రమువలె పాటుపడుచు నలజడి గావించుచుందురు. ఇందువలన బెక్కు మార్పులు గలుగును. వీనినే యభివృద్ధియని పాశ్చాత్యులు గర్వింతురు. పాశ్చాత్యుల ప్రజా ప్రభుత్వపు సందడులు పరదేశములను కొల్లగొట్టుటకే. తమ దేశీయులకు సమానములగు హక్కులను, అవకాశములను బ్రసాదించినను నది యితరులను నిరోధించుటకే. తమ సంఘీభావ శిక్షణము పరదేశములను పాడుచేయుటకే. స్వదేశమునందు ప్రజాపాలనము, పరదేశమందు నిరంకుశ క్రూర పాలనము. వీనికి నూతన నామముల నిడి, పైపై పూతలు పూసి దీనినే యభివృద్ధి, నాగరికత యని వారు విఱ్ఱవీగుచున్నారు.

పాశ్చాత్యులు పట్టణవాసులు. వీరి కొక స్థిర నివాసముండదు. ఒకపూట పూటకూలియింటభోజనము; వేరొక యింట నివాసము. తఱచు ఒక పూటకూలి యింటినుండి వేరొక యింటికి, ఒక అద్దెయింటినుండి మరియొక యింటికి

మారుచుందురు. ఈ మార్పు వీరి ప్రాచీనమగు ననాగరిక తను బ్రదర్శించును. తమ ప్రక్కయింట నేమి జరుగునో వార్తాపత్రికలు చదివి దెలిసికొనవలసినదే గాని సాంగత్య జీవితముచే నెఱుగరు. మనమో పల్లెవాసులము. స్థిర వాసులము. పరస్పర పరిచయ సాంగత్య జీవితపథికులము. మన యంగవస్త్రధారులు వారి కనాగరకులు. తమవలె వేషములు వేయనివారు అనాగరికులని వారి భావము. కాని వారిలోని దిగంబరులను మన మేమనవలెను? మన మే మన్నను ఇది వారికి నాగరిక చిహ్నమే. ఏలన: మార్పేగదా వారు వాంఛించునది! మన శరీరములపై పచ్చలు పొడిపించుకొనుట యనాగరిక లక్షణము. కాని వారి స్త్రీలును, సైనికులును వివిధ మృగాకారములతో పచ్చలు పొడిపించుకొనుట నేటికిని గాంతుము. పెదవులకు, చెక్కిలకు, కాళ్లకు కృత్రిమ వర్ణములు వేసి 'యిది నవీన నాగరికతా చిహ్నము, పరిణామము' అందురు. కాని భారతీయులు కంటికి కాటుక పెట్టుట, ముఖమునకు పసుపు పూయుట, నుదుట కుంకుమ ధరించుట వారి దృష్టిలో ననాగరకత.

సామ్రాజ్య వాదులు, నిరంకుశాధికారులు, నిలువున మానవుల గాల్చి చంపువారు, అసత్య ప్రచారకులు

కపట శాంతిపత్ర ప్రదాతలు, కుత్సిత రాజకీయ తంత్రజ్ఞులు, భోగలాలస జీవితులును నేడు నాగరికులైరి. వీరి దృష్టిలో నితరదేశీయు లనాగరకులు.

పరుల క్రూరములగు దాడుల ఫలితముగ భారతీయులు కొన్ని శతాబ్దములనుండియు నభివృద్ధి గాంచజాలకపోవుట నిక్కువమే. పరులు మనల పీడించి, తమ స్వభావములు మనపై బలవంతమున నంటగట్ట బ్రయత్నించుట విచారకరమే. ఇందు కొంతవఱకు వారు జయము గాంచినదియు సత్యమే యని నుడువవలయును. కాని యిట్టి చావు బ్రతుకుల మధ్య భారతీయు లభివృద్ధిని గాంచి, వికసించు నవకాశమెద్ది ? తమ నాగరికతా జ్యోతిని ప్రకాశింపజేయు వాతావరణమేది ? ధర్మనిధిని రక్షించుకొనుటకే యుక్కిరిబిక్కిరి యగుచుండ, నిక దానిని పెంపొందించుకొనుటకు సావకాశమెక్కడ ?

# లలితకళలు - స్వదేశ మతము

కళలేని మానవజీవితము కాంతిలేని సూర్యగోళము. ప్రతివానికి కళ సహజలక్షణము. మానవుని సర్వకార్యములందు నిది నిండి నిబిడీకృతమై యున్నది. ఈ విషయమున ప్రాచీన భారతీయ జీవిత మాదర్శ ప్రాయము. అతడు కళను మూర్తీభవింపజేసి తన నిత్యజీవితమును దేదీప్యమానముగ బ్రకాశింపజేసెను. భారతీయుల దేవాలయములు, బౌద్ధ స్తూపములు, గుహల శిల్పములు, చిత్ర విచిత్ర వర్ణములతో జిత్రించిన పుష్ప, లతా, పత్ర, పశు పక్ష్యాదులు భారతీయుని కళావికాసమును అవ్యక్తనాదముతో జాటుచున్నవి. దక్షిణాదినిగల రామేశ్వర శ్రీరంగ మధుర దేవాలయములు, ఆంధ్రదేశమందలి యమరావతి, నాగార్జునకొండ మున్నగు బౌద్ధస్తూపములు, విద్యానగర దేవాలయ గోపురములు, అజంతా యెల్లోరా గుహలు ఇటులెన్నియో క్షేత్రములు భారతీయుల కళానైపుణ్యముల కాంతులు వెలిగ్రక్కుచున్నవి.

"ఉత్తమ భారతీయ శిల్పము ఉత్తమ గ్రీకు శిల్పముకంటె నధిక రసోద్దీపకము, సూక్ష్మతర భావ ప్రేరకమునై యున్నది. ఈ కళాసాంప్రదాయమున నొక విధమగు నిండు

తనమును, ఆధ్యాత్మిక తత్త్వమును గలవు. ఇవి గ్రీకుల యంతరాత్మల నంటని విలక్షణములు."—ఇ. బి. హావెల్.

"గుహలు దొలిచి, కట్టడములు నిర్మించి,యందుచిత్ర విచిత్ర శిల్పములను నిర్మించుశక్తి యందు భారతీయులు పరిపూర్ణపండితులు.ఎవ్వరును వీరికితుల్యులుగాజాలరు."

—డాల్బస్గురాజు.

ఇంతియేగాదు; భారతీయులు తమ సామాన్య గృహములను, గృహోపకరణములను, పాత్రలను, ప్రతి చిన్న విషయమునను-తమ నిత్యజీవితమున-కళను తాండవింపజేసిరి. కడచిన ౫౦౦౦ సం॥ నుండి మన జీవిత వికాసమును పోషించి రక్షించిన దీకళాసంపదయే. నేటి పట్టణములను, అందలి దుకాణములను గాంచుము. కన్ను పొడుచుకొన్నను కళ గాన్పింపదు. కళారహితములగు నున్నని భవనములు, తెల్లని గుడ్డలు, సాపైన వస్తుసముదాయమే నేటి మన పట్టణ ప్రదర్శనము. కళారహితముగ నున్నను కొంతకు కొంత మేలే గాని యివి యట్లు గాక కళాపతనమును బ్రదర్శించును. ఎచ్చటనైన భారతీయ కళాకౌశల కాంతులు వెదజల్లు వస్తువులు, పాత్రలు, బొమ్మలు, గుడ్డలు గన్పించుచో నవీన నాగరికులు వానిని పురాతనములుగ, మోటుగ భావించి నిరాదరముగ

ద్రోసివైచుచున్నారు. కళ యథార్థముగ మోటువానిచే ప్రదర్శింపను బడదు; వాని యామోదమును బొందదు. మన జీవిత వికాస కాంతుల వెదజల్లు వస్తుసముదాయము నేడు పాశ్చాత్యుల ప్రదర్శనములందును, మ్యూజియము లందును మూతపడియున్నవి. మఱియు జర్మనీ,ఇంగ్లాండు, జపాను మున్నగు దేశీయులు వీని నమూనాలు తమ వస్తూత్పత్తికి వినియోగించుకొని వానినే మన నెత్తిని రుద్దు చున్నారు. అందువలన కోట్లకొలది లాభములు గడించు చున్నారు. పాశ్చాత్య నాగరికత యంత్రవ్యాపార నాగరికతయే. కావుననే యిది పెద్ద పెద్ద యంత్రాలయముల నెలకొల్పి కళయందలి సృష్టిశక్తిని,జీవితవికాసమును హత మొనర్చినది. మనము దానిని గుడ్డితనముగ ననుకరించుచు మన సహజ జీవితమును కళావిహీన మొనర్చుకొనుచు న్నాము. కాని కొలదికాలమునుండి మనయందు వివేకము వికసించి, మన కళలను, స్వదేశ వస్తువులను గౌరవించి, పోషింప కృషిగావించుట శుభసూచకమే. చిత్ర విచిత్రములగు నమూనాలతో, వివిధాలంకారములతో, ప్రసిద్ధ హస్తనైపుణ్యమును, నిర్మాణశక్తిని ప్రదర్శించు రత్నాలయమే భారతీయ లలితకళ. కాని యాంగ్లమానసవికార రూపులగు భారతీయులు కొందఱు, ఆంగ్లుల ననుకరించిరే గాని యావేశపూరితమై యాహ్లాదమును జేకూర్చు

నందచందముల కాకరమగు నెక్క వస్తువునైన నిర్మింప జాలకుండిరి. పైపెచ్చు వంశ పరంపరాగతమగు సర్వకళల నీసడించి వినాశ మొనర్చిరి. నేటి పట్టణములందలి యే దుకాణములకైన నేగుము. అచ్చట నేమి గాంతుము! మన హస్తకౌశల నిర్మిత సుకుమార సుందర విగ్రహములనుగాని, ఆనందావేశముల బురికొల్పు జీవిత వికాస సంపత్కరమగు వస్తుసముదాయమును గాని, నిత్యజీవితావసరమగు లోహ పాత్రలు, రాతి-కొయ్యబొమ్మలు, వివిధ లతాసంపదతో గూడిన సున్నితములగు వస్త్రములు, రత్న కంబళములు, దేవతా విగ్రహములు మున్నగువానినిగాని గాంతుమా? లేదు. అట్లు కాక కళాశూన్యములై, కాంతి రహితములై, తళతళ మెఱయుచు తక్కువజాతికి జెందిన, హెచ్చుధరగల తాత్కాలిక జీవితముగల పాశ్చాత్య వస్తుసంపదను గాంతుము. విపణివీధి నిండుగ, హెచ్చుధనమును గుంజుట కాధారరూపములగు వస్తువులేగాని, మానసిక వికాసమును, జీవిత వికాసమును జేకూర్చునవి గానరావు. గ్లాసుగ్లాసులు. పచ్చిరంగుల నున్నని సారా పీపాలు, బూటు పాలిషులు, మార్కింగు సిరాలు, సబ్బులు, దువ్వెనలు, ఫేసుపౌడరులు, సెల్యులాయిడ్ బొమ్మలు, కాగితపు పుష్పములు, అందచందములు లేని యనవసర వస్తుజాలమే

మనకు గానబడును. మన యర్థశాస్త్రవేత్తలు, రాజకీయ వేత్తలు, శాస్త్రకారులు, పాశ్చాత్య సంప్రదాయ విద్యా పారంగతు లెల్లరు దీనినే మన సంపదగ, అభివృద్ధిగ, లక్ష్యముగ భావించి కీర్తింతురు. ఆర్థిక స్వాతంత్ర్యమే మన లక్ష్యమా! అర్థ సంపాదనమే మన కృషి కుచిత ఫలమా! కాని యివి కొలదిమంది మారు బేరగాండ్రను ధనవంతుల గావించునే గాని దేశమునందలి వివిధ వృత్తులను నాశన మొనర్చి ప్రజల నిరుద్యోగులుగ, దరిద్రులుగ గావించుచున్నవి.

మనకు జీవిత వికాసమునకు వలయు సర్వవిషయము లందును - ఆర్థిక సాంఘిక సౌష్ఠవమును, కళాకౌశల వికాసమును, ఆధ్యాత్మి కౌన్నత్యమును బడయు స్వాతంత్ర్యము కావలయును గాని కేవల రాజకీయము మాత్రము గాదు. మనము వాంఛించునది యంత్ర చలనమును గాక ప్రాణ శక్తినే. అనుకరణమునుగాక సహజశక్తి ప్రకాశమునే. ఆత్మరహితమై, కళారహితమై, హృదయ రహితమైన వ్యాపార నాకరికతను గాక ఆత్మోద్దీపనమును జేకూర్చు శాంత జీవితమునే.

కళయం దే దేశీయులనుండియైన నొకనూతన వికాసము విస్తరిల్లినచో నది భారతీయులనుండియే యుద్భవిల్లి

ప్రపంచమున వ్యాపించిన దను విషయము మీ రెఱుగుదురా? బోర్నియా, జావా, సుమత్రా, చైనా మున్నగు ఆసియా ఖండ ప్రాంతములందు భారతీయుల లలితకళా కౌశలమే నేటికిని ఉట్టిపడుట లేదా? మనము మనలను, మన పరిసరములను శుభ్రముగను, అందముగను నుంచుకొనినపుడే నీతి ప్రబలును. వీనిని జేకూర్చునవి లలితకళలే. మనము మనకళ నెట్లు భ్రష్టమొనర్చితిమో యొక్కపరి తిలకింపుడు! గృహముల కప్పులకు తుత్తురు రేకులు, మేడలకు నున్నని సిమెంటు లాదులు, నున్నని దర్వాజాలు, ద్వారబంధములు, గోడలు, నీళ్లు దెచ్చుకొను కిరసనాయిలు డబ్బాలు, ఇంటి నిండ సాదా లోటాలు, కాఫీ పాత్రములు, జపాను సెల్యులాయిడ్ బొమ్మలు, కాగితపు పుష్పములు, లతలు, గాత్రస్వరమును జెఱచు గ్రామఫోనులు, దిగంబరత్వమును జూపించు ఉల్లిపొర వస్త్రములు ఈవిధముగ సర్వమును కళారహితము. ఇంతే గాదు; వేషమున, జుట్టున, కట్టున, నడకను, సర్వమున పరుల ననుకరించుటయే. ఇతరులనుండి యరువు గొనుటయే. ఆర్థిక వినాశమును, ఆత్మ విచ్ఛిన్నతను గావించుట కింతకు మించిన ప్రబల నిదర్శనము లేమి గావలయును? కళయందలి యీ నిర్లక్ష్యత, ఈ సడింపు సున్నితములగు మన రుచులను బారద్రోలి, బలసౌష్ఠవములను దగ్ధ

మొనర్చి మనజాతిని పరుల బిచ్చముపై నాధారపడు దుర్బలజాతిగ జేసినవి. లలితకళలే యార్థిక, సాంఘిక సమస్యలను బరిష్కరించి జీవితమునకు నూతనశక్తిని, దేశమునకు నూతన శోభను నొసగును. శాశ్వత వికాస జీవితముల నొసగునవి కళాసంస్కృతులేగాని తాత్కాలిక, డాంబిక దృశ్యములుగావు. జీవిత సౌష్ఠవము లేని జాతి దేశము నెట్లు ప్రేమింపగలదు? నేటి మన దేశభక్తి శూన్యతను బ్రబలజేయునది యీ కళారహితానుకరణజీవితముగాదా?

ప్రాచీనకాలమున ప్రపంచమున కందచందము లొసగి జ్యోతివలె ప్రకాశించిన దేశము నేడు దుర్బలమై, జాతీయత్వమున కుంటు పడ్డది గావున పాశ్చాత్యులను తిరిపెమెత్తుట మానవలెను. స్వశక్తిపై కళలను పోషించి, వ్యాపారమును బెంపొందించుకొని స్వాతంత్ర్యమును బడయవలెను. కళాకౌశలము సృష్టిశక్తిని వికసింపజేసి విస్తరింపజేయును. ఈ శక్తియే మనయందు నిర్మాణశక్తిని, ఆచరణశక్తిని ఉదయింపజేయును. కళాపోషణమే క్రమ జీవితవికాసము. కళాపోషణమునందే వ్యాపారాభివృద్ధియు, వృత్తిపోషణమును లీనమైయున్నవి. మనము మురళిని, తంబురాను మాని పరుల హార్మోనియములు కొనుటయే తడవుగ మన వస్తు నిర్మాతల వృత్తి నశించినది. వారి యీ వ్యాపారము మంటగలసినది. మనలోహ

పాత్రములుమాని పరుల గాజు, పింగాణి పాత్రలకు ప్రాకులాడిన నాడే యావృత్తులు నశించి యా వ్యాపారము కూలిపోయినది. మన సాలీలు, కుమ్మరులు, కమ్మరులు, వడ్రంగులు, మాదిగలు తమ తమ వృత్తులు గోల్పోయి దరిద్రులైరి.

పక్కా-రంగుల, వివిధ ఫల పుష్ప లతా చిత్రమయములగు మన రవసెల్లాలు, పీతాంబరములు, సరిగ-చీరలు, చిత్రవిచిత్ర లోహపాత్రములు మున్నగున వెల్ల పోషణ లేక పాలసిపోయినవి. ఈ వృత్తులు నశించుటతో నెల్లరు వ్యవసాయమున కెగబ్రాకి స్పర్థలు-పోటీలు పెంపొందించుకొనిరి. కేవలము చౌకవస్తువులకు ప్రాకులాడి మ్యాంచెస్టరు, గ్లాస్గోలవంకకు మోరల నెగబట్టితిమి. యంత్రాలయములలో నెందఱు తల్లులు, పిల్లలు విధి విరామము లేక కష్టించుచున్నారో తెలియునా ? వారు నివసించు గృహములు, వారి పరిసరములు మురికి కూపములే గదా ! వీరి సౌకర్యములు గమనించువారు లేరు. నీతిని గాపాడువారు లేరు. ఆర్థిక లాభవాంఛ యింకెన్నియేని దారుణచర్యలకు గడంగును. ఈ కూలీలు నిరాధారులై, నిస్పృహజెంది మరణింపవలసిన దే. ఆంగ్లదేశజనసంఖ్యలో పదవ వంతు యంత్రాలయములందు, చెరసాలలయందు, పిచ్చి యాసుపత్రులందు నశించుచున్నారు. తాత్కాలిక

లాభమునకు మానవశక్తిని వృథాపరుపరాదు.కళాశక్తిని బెంపొందించి మానవశక్తిని పోషింపవలెను. కళారహిత వస్తునిర్మాణ వ్యాపారము లల్ప మనస్కుల నాకర్షింపజేయు నేమోగాని వారిని పశుతుల్యులుగ గావించును. నేడు దేశమున జాతీయవాదులు స్వదేశవస్తువులను, గృహ పరిశ్రమలను బోషింప ప్రజలకు త్యాగమును ప్రబోధించుచున్నారు. కాని యిందు త్యాగ మే మున్నది? భారతీయ కుటీర పరిశ్రమలను పోషించుట యన వారు తమ వస్తువులను తాము గౌరవించి యాదరించుకొను టయే. తమ్ము తామాదరించుకొనుటలో త్యాగమెక్క డిది? ఇవి స్వచ్ఛందజీవితమునకు దోహద మొసగును. ఆత్మవికాసమునకు దారిజూపును.

నేటికిని మన పల్లెలలో కళానైపుణ్యమును బ్రదర్శింప గల శిల్పులు పెక్కురు గలరు. వీరు తమ్మాదరించువారు లేక మరుగుపడియున్నారు. వారి కవకాశ మొసగుచో పాశ్చాత్యులను దిగ్భ్రమజెందించు పెక్కు చతుర కళా వస్తువుల నిర్మింపగలరు. మనము పాశ్చాత్యుల యుచ్ఛి ష్టములకు మురిసిపోయి మన కళాకోవిదుల, వస్తునిర్మాతల నోట మట్టిగొట్టుచున్నాము. కాబట్టి మనలో సంపన్నులు పాశ్చాత్య వస్తువ్యామోహ తృష్ణల దగుల్కొనక వస్తు వుల మూల్య మెక్కువయను సాకుజూపక మన పక్కా

రంగుల కాశీ పీతాంబరములను, బందరు కలంకారీ వస్త్రములను, ఢిల్లీ పాలరాతి బొమ్మలను, కుంభకోణపు పాత్రలను, విశాఖపురి దంతపు పనిముట్లను, మైసూరు చందన వస్తువులనే యెక్కువ మూల్య మిచ్చియైన కొనవలెను. కుటీరమున చిన్న దేవుని విగ్రహమును బూజించు పేదవానికిని, పెద్దదేవళమున పెద్ద విగ్రహమును బూజించు భాగ్యవంతునకును నెట్టి భేదమును లేదు. పేదలు, భాగ్యవంతులు శక్తికొలది దేశవస్తువుల నాదరించి కొనుటయందే దేశ సంపద యభివృద్ధియు, స్వాతంత్ర్యవికాసమును గలదు. జాతీయ సంపత్ దృక్పథమున గాంచినచో నెక్కువకాలము మను ప్రియపు వస్తువులు శీఘ్రముగ నశించు పెక్కు చౌక వస్తువులకన్న లాభదాయకములు. శతాబ్దముల కొలదియు చెక్కు చెదరని ప్రాచీనపు కట్టడములు అత్యల్పకాలమున నశించు క్రొత్తకట్టడములకంటె మిన్నలుగావా? వంశానుగతమగు హస్తనైపుణ్యమును, లావణ్య సౌకుమార్యములను బ్రదర్శించు మన ప్రాచీన వృత్తిసంపన్నులగు సాలె, కుమ్మరి, శిల్పి మున్నగువారు నేటి యంత్రములకన్న, యంత్రనిర్మాతలకన్న మిన్నలే గదా!

మన వాంఛలు క్షణ క్షణమును విచ్చలవిడిగ బెంపొందించుటకన్న నిత్యావసర వస్తువుల నెల్లరకు బ్రసాదించు

టయే నిజమగు నాగరికత. కళలు ఆర్థిక సంపదను పెంచి జీవిత వికాసము నొసగును గాన వానిని ప్రేమించి పోషింప వలెను. గత శతాబ్దమువఱకును మన గ్రామములు కుటీర వస్తు సంపన్నములై, కళాపూరితములై శోభిల్లినవి. ప్రజలందరు నిత్యజీవితమునకు వలయు నాహార పదార్థ ములు, వస్తుసముదాయములతో నిండి యుండిరి. ఇతరు లను హృదయపూర్వకముగ నాహ్వానించి, యాతిథ్య మొసగి సత్కరించిరి. ఇది నాగరికతౌన్నత్యమును ప్రక టించును. పాశ్చాత్య విద్యావ్యామోహము మన మనసు నకు మత్తుగూర్చి మనలను గొఱ్ఱెలమందల గావించినది. తత్ఫలితముగ స్వల్పకాలముననే మన పరిశ్రమలన్నియు పాడుపడినవి. అసహ్యకరములును, అప్రయోజనములు నగు పెక్కు వస్తువులు పాశ్చాత్య మానసిక పుత్రుల గృహముల నలంకరించిన దాది మన సిరిసంపద లంతర్థాన మైనవి. మన 'జన్మహక్కు'ను, పాశ్చాత్య నాకరికతా వ్యామోహాంధకారమున - సగర్వముగ - మనమే గూల ద్రోచితిమి. మన జీవిత వికాసమును తాత్కాలికములగు మిరుమిట్లు గొలుపు మెఱుపులతో బేరమాడితిమి. మన సౌందర్యమును వ్యామోహ భ్రాంతులమై పై వేషము లను బలి యొసగితిమి. మన స్వదేశీ యుద్యమము కేవ లము పాశ్చాత్య దృక్పథముతోడనే పునరుద్ధరింప

గూడదు. ఆర్థిక దృష్టితో పాశ్చాత్య మార్గముల నను కరింపరాదు. మన జాతీయోద్యమము ఆర్థిక మూల్య ముతో బాటు ఆంతరంగిక మూల్యమును, రాజకీయ స్వాతంత్ర్యతతో బాటు రాటుదేలిన సంస్కృతిని బ్రదర్శింప వలెను. కుటీర పరిశ్రమలు గావించువారు తమ యుదర పోషణమునకే గాక జాతి వికాసమునకుకూడ దోడ్పడు చున్నారను భావము మనలో బెంపొందవలెను. యంత్రము లందు విరివిగ వస్తువుల నిర్మించుటయే గాక ఆయా పరిశ్ర మలు గావించువారి సుఖమును గణింపవలెను. 'వస్తువుల కంటెను మానవులే విలువగలవా'రను నాదర్శమును మరువరాదు. ఆర్థిక నాగరికతా గమ్యస్థానము దుస్సహ మగు శ్రమ జీవితముగాక శాంతియుతమగు విశ్రాంత జీవి తమే యని మరువరాదు. కళారహితమగు స్ఫూర్తి మాన వుని హృదయ వికాసమును జూపదు. మానవుని స్వార్థ పరునిగ గావించి పశుతుల్యునిగ జేయును. జనుల రక్త మాంసములు పీల్చి, నిర్వీర్యుల గావించు యంత్రనాగరి కత మానవాభివృద్ధి నెట్లు గావించును? దేశసంపదభివృద్ధి మానవుని పరిశ్రమఫలితముగాదా! పాశ్చాత్య విద్యా భ్యాసముచే నభివృద్ధి గాంచుచున్నామని భ్రమించుకవులు, ఉపన్యాసకులు, శాసనసభాసభ్యులు, అధికారులు, స్వతంత్ర వృత్తి పరుల మని గర్వించు న్యాయవాదులు, వైద్యులు,

పాశ్చాత్య నాగరికతాకన్యక కూడిగ మొనర్చు సర్వ భారతీయులు తమ దగు సర్వము నీసడించి పాశ్చాత్త్యుల యంత్రనిర్మిత వస్తుజాలము నంతటిని మన విపణివీధుల నింపి, మన వృత్తుల నాశముచేసి, మన దేశభాగ్యమును సంగ్రహించి తాము భాగ్యవంతులైరి. పాశ్చాత్య కళా రహిత విధానములతో మన భవనములు నిర్మితమైనవి. అవి వారి వస్తుసముదాయముతో నింపబడెను. నవనవ విధానములకొఱకు శ్వేతజాతులను, ఆంగ్లో హైందవులను నాశ్రయించి పావనులము గా బ్రయత్నించితిమి. గ్రామ ఫోనులు, రేడియోలు మన గాననైపుణ్య ప్రదర్శకము లైనవి. ఆంగ్ల గానసభల కెగబడి మన గాయకుల నోట దుమ్ముగొట్టితిమి. పాశ్చాత్త్యులవలె సర్వ మాంసాహార ములు బల్లలపైనిడి, కుర్చీలపై గూర్చుండి ఫోర్కులతో, చెంచాలతో, కత్తులతో దినసాగితిమి. విస్కీ, బ్రాంది, చాంపెయినులను తీర్థములుగ పానమొనర్ప దొడగితిమి. మన గోడల నగ్నదృశ్యములను, ఫ్రెంచిపటములను, ఇండ్లయెదుట రోమను విగ్రహములను, జపానీయుల కాగితముల-గుడ్డలపువ్వులను, తీగలను, సెల్యులాయిడు బొమ్మలను, కాళ్లక్రింద ఆంగ్లేయుల తివాసీలను, శరీర మునకు ఆంగ్లేయ వేషచిహ్నములగు సూటు, బూటు, టై, హేటులను గూర్చితిమి. మన వర్తకులు తమ

యాన్త్రిక లాభమునకు వారి వస్తువుల నమ్ముటకో, వారి కంపెనీల నిందు నెలకొల్పి భాగముల బడయుటకో మొదలిడిరి. ఇది నిజమగు జాతీయతగాదు. జాతీయత యన జీవితమును సక్రమపథమున వికసింపజేయుట. ఇది హృదయ పుష్ప వికాసబంధురము. నీతిబద్ధము. జీవితకళను నీ హృదయ కమలమున జిత్రించి వికసింప జేయ నేర్చుకొనుము. వికారమగు పరపీడన జీవితమును భస్మీపటల మొనర్చి హృదయవికాసము, కౌశలముతోడి జీవితాభివృద్ధిని గావించునదియే జాతీయత. దీనిని మరచి మన మానసిక దారిద్ర్యము, భావదాస్యములను గమ నింపకుండుట విచారకరము. మనదేశమున నేటివఱకు పాశ్చాత్యపద్ధతులపై నిర్మింపబడిన సకల వస్తుసము దాయ మకస్మాత్తుగ, నొకక్షణమున నాశమయినను మనము దరిద్రులము గామనియే నా విశ్వాసము. ఆత్మ విశ్వాసము నశించిన సృష్టిశక్తి క్షీణించును. ఆంగ్ల మానసపుత్రులముగ బ్రదుకుటయే మన శిక్షణ ఫలితము గారాదు. మనదేశమును పునరుద్ధరింపవలెననిన మన ప్రస్తుత పతనమును గ్రహింపవలెను. మన ప్రాచీనతను గుర్తింపవలెను విజ్ఞాన వికాసములు పాశ్చాత్యుల సొత్తే యను భావము మనలను వీడనంతదనుక, మనదేశ వ్యాపా

రాభివృద్ధి - పునర్నిర్మాణ మసంభవము. మన వస్తునిర్మాతలను బహిష్కరించి పరుల పంచల నూడిగము గావించుచున్నాము. ఇది తొలగనిదే మనకు ముక్తి లేదు.

"స్వదేశి వస్తువులను, వస్త్రములను దప్ప నన్యముల నాసింప మను దీక్షను భారత స్త్రీ పురుషులు గైకొనవలెను."
—సర్ జార్జి బర్డువుడ్.

మనలనుగూర్చి పాశ్చాత్యులే యిట్లు ప్రకటింప మన బుద్ధులేమైనవి? ఇది యెంత సిగ్గుమాలినతనము! ఈ విషయమున ఆంగ్ల ప్రభుత్వ విధానమును, విద్యా విధానమును గర్హింపకుండ నుండజాలము.

"మనదేశ ప్రజలను స్వతంత్రుల జేయుడు. వారి సంకెలలను విదలింపుడు. బురదచే బురదను కడుగగలమా? భావదాస్యముచే సాంఘిక, ఆర్థిక దాస్యములను బారద్రోలగలమా? ఏదీ? ఒక్క నిదర్శనమును జూపుడు. సంఘము నిమిత్తము సర్వ సుఖేచ్ఛలను త్యజింపగలిగిననాడు నీవు బుద్ధుడవై ప్రకాశింతువు ముక్తుడవై వెలుగొందుదువు."
—వివేకానంద.

కార్యాలయములలో, భోజనశాలలలో, రైళ్లలో, సర్వవిషయములలో నేడు మనము చూపుచున్న వైదేశిక పద్ధతులకు ధిక్కార తిరస్కారములు. ఇవి మనము

నేర్చిన విద్యావిధాన ఫలితములే. మన నాగరికతా జీవితమునకు కళంకములే. మనము నేర్చిన విద్య పాశ్చాత్య పుస్తక ప్రకాశకులను బాగుచేయు సాధనము. భారతీయ లక్షణమిందు మృగ్యము. ఇది భారతీయ కళను వెక్కిరించుచున్నది.

# భారతీయ సంస్కృతి

సంస్కృతియన నేమియో యొక్కింతయాలోచింతము.

'విపుల మాధుర్యకాంతులే సంస్కృతి.'

—మ్యాత్యూ ఆర్నాల్డు.

'భౌతిక, ఆధ్యాత్మిక జీవితమున సాంఘికముగ లీనమై యున్న పదార్థమే సంస్కృతి.' —ప్రొఫెసర్ శాపిల్.

"నాగరికత యను పదార్థమునకు రూపమొసగునది సంస్కృతి." —అరిస్టాటిల్.

భారతీయుల భావమున నాగరికత యను సుకుమార పుష్పమందలి సువాసనయే సంస్కృతి. నాగరికతను చుట్టు ముట్టి,ఆవరించి,వికాసమున ప్రకాశింపజేయునదే సంస్కృతి.

భారతఋషులు ప్రకృతి భిన్నత్వమును ప్రేమించి, స్నేహభావముతో మెలగిరేకాని, పోరాడిపోటీలు పెంపొం దించుకొనలేదు. ప్రేమమయమగు స్నేహభావముతో ఔన్నత్య మార్గమున పోటీపడిరిగాని, తమకు సేవచేయు టకు బలవంతముగ నితరులను స్వాధీనము చేసికొనుట యందుగాదు. వారు ప్రకృతిని ప్రేమించి, గడచి యద్దాని వెనుకనున్న యాత్మను సాక్షాత్కరింపజేసికొనిరి.

'అగ్ని జలములందు బ్రకాశించునట్టియు, ప్రపంచమంత టను వ్యాపించియున్నట్టియు, ఓషధులు, మూలికలందు

గలట్టియు పరబ్రహ్మకు నమస్కరింతును.'...—శ్రుతి. ఇంద్రుడు, వరుణుడు, అగ్ని మున్నగువారు పూర్వము బ్రహ్మను సాక్షాత్కార మొనర్చుకొనిరి. భారతీయులకు మేదిని మాత. వాయువు తండ్రి. అగ్ని సఖుడు. సముద్రము బంధువు. ప్రాకృతిక శక్తులనెల్ల భజించి వాని వెనుక నున్న యాత్మయొక్క యుద్దీపనమునకే ప్రాచీన సారస్వత మంతయు బ్రబలినది. ఇదియే వేదకాలపు భారతీయుల సంస్కృతి.

వారు ఇతరనాగరకతలను ద్వేషించి నాశన మొనర్పక, వానినన్నిటిని 'ఆర్యవిజ్ఞాన'మను మూసయందు పోతబోసి సమీకరణ మొనర్చిరి. భారత దేశము సర్వనాగరికతలను సమన్వయ మొనర్చి సహన సఖ్యతలను బ్రదర్శించెను. భిన్నత్వమున నేకత్వమును బ్రకటించెను.

షడ్దర్శనకర్తలీ దేశమున వెలసిరి. బౌద్ధజైన చార్వాక లోకాయత మతములిందు తమ తమ భావములను స్వతంత్రముగ బ్రచార మొనర్చినవి. ద్వైతాద్వైత విశిష్టాద్వైత ములిందుద్భవిల్లినవి. వీనియన్నిటియందును తేనమై, చుక్కలలో చంద్రునివలె వీని వెనుకనున్న యాత్మను వేదములు ప్రకాశింపజేసినవి. ఆదర్శ మొకటే యైన సద్గానిని ప్రాపింప జేయుటకు మార్గములు వేరుగ నుండును. వివిధ మానవులు పలు తెఱగుల యాహారములు గ్రహింతురు.

ఒకేవ్యక్తి వివిధ సమయముల వివిధాహారములు స్వీకరించును. ఆరోగ్యవంతుని యాహారము రోగికి విషతుల్యము. రోగి పథ్యపుమెతుకులు ఆరోగ్యవంతునకుగిట్టవు. కావున మార్గములు వేరైనను లక్ష్యమొక్కటియే. మానవుని ప్రకృతినిబట్టి, సంచితకర్మములనుబట్టి భిన్న మార్గము లవలంబింపబడును. భక్తి జ్ఞానకర్మయోగము లిట్టివే. బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్ర వర్ణనియమముల మూల మిదియే. బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థ సన్యాసముల జీవిత క్రమాభివృద్ధి విధాన కీలక మిదియే. ఇందు హెచ్చు తగ్గులకు, ఉచ్చనీచతలకు దావు లేదు. తమ తమ తత్త్వముల కనుగుణమగు మార్గమును స్వీకరించి గమ్యస్థానమున కందరు పయనింతురు. ఇష్టదేవ తారాధనా విధానమే శాంతిని ప్రబలజేయును.

మానవుల యభిరుచులను, స్వభావములను గమనించి, పరస్పర ధర్మసహాయమునకే వర్ణము లేర్పరుపబడెను. కాని నేటి కుల తారతమ్యములకు ప్రాచీన భారత సాంప్రదాయమున, సాంఘిక జీవనమున, ఆదర్శమున తావు లేదు. నేటి కులతత్త్వములు తమ యథార్థ తత్త్వమును గోల్పోయినవి గాన నివి యనుకరణీయములు గావు. వీని నెంత త్వరితముగ నంతరింపజేసిన దేశమున కంత శ్రేయము గలుగును.

విచక్షణా వివేకములు లేని నేటి కులతత్త్వములే జాతి నధోగతి పాలు గావించినవి. అగ్రజాతుల యహంకారమును, పరదేశ పాలితులను 'విభజించి - పాలించు' ప్రభువుల కుత్సిత రాజనీతి సూత్రములును వీనిని విచ్చలవిడిగ బ్రబలజేసినవి. స్పర్ధను వృద్ధిచేసినవి. వీనిని రూపుమాపుట యత్యవసరము.

# సంస్కృతి దాత

ప్రాచీనకాలమునుండియు భారత దేశము సారవంతమగు భూములకు, భాగ్యవంతులగు ప్రజలకు నాలవాలమై, సర్వ శాస్త్రములచేతను, కళలచేతను, మతములచేతను, నాగరికత చేతను శోభితమై భూలోక స్వర్గముగ వెలుగొందినది. సామాన్య మానవు లూహింపజాల నంతటి యార్థిక నైతిక మత వికాసము గలిగి, ప్రపంచమందలి సర్వమానవులును 'కలలు గాంచు దేశము'గ నుండెను. ప్రాచీన బాబిలోనియా, ఈజిప్టు దేశములు మనదేశ వస్తువులకు ముగ్ధములై దీనితో వర్తక వ్యాపారములు గావించెను. వివిధ శాస్త్రములతో, కళలతో బెంపొంది, వస్తునిర్మాణమున సిద్ధహస్తులై ప్రపంచ జాతులనెల్ల నాకర్షింప గలిగినది భారతీయులే.

''ఇతర ప్రాంతముల నెచ్చటను లభింపని వివిధ వస్తువులను భారతీయు లమ్ముచుండెడివారు. కళాకాంతు లుట్టిపడు ముత్యపు చిప్పలతో గావింపబడిన చిత్రవిచిత్ర వస్తువులను, అద్దములవలె తళ తళ మెఱయు వివిధములగు రాలను, స్వచ్ఛమగు మంచువలె ప్రకాశించు శ్వేతాంబరములను, వివిధ వర్ణములతో, నమూనాలతో

సలంకృతములను కలంకారీ వస్త్రములను, పట్టు పీతాంబరములను విపులముగ విపణివీధుల విక్రయించెడివారు. పచ్చి మాంసమును భుజించు ననాగరికులగు ఐరోపీయనులుగూడ భారత వస్తుసంపదను, భారతీయుల వివిధ గాథలను వినుటయే తడవుగ పేరాసతో నీ వస్తువులను గొంపోయి యూరపుతో వర్తకము గావించిరి. అరబ్బులు, పారసీకులు వీరి ననుకరించి, భారతీయుల వస్తువులను గొని యూరపు నందు వ్యాపారము గావించెడివారు. ఈ వస్తువులను గొంపోవు మార్గములందు భాగ్యవంతములగు పెక్కు పట్టణములు వెలసెను. ఈ మార్గములు మారగానే యా పట్టణము లంతరించెను. ప్రాగ్దేశములందుగూడ భారతీయుల వ్యాపారము విస్తరించెను. మారుమూలలగల చిన్న చిన్న లంకలకుగూడ భారతీయుల వివిధ వస్తువులు వ్యాపించుటచే వారు భారతీయుల సిరి సంపదలకు, సౌభాగ్యమున కచ్చెరువందెడివారు. భారతీయ వర్తకమును యూరపున కంతకు గుత్తగొనియే వెన్నిసు, జినీవా వర్తకులు భాగ్యవంతులైరి. ఈ విషయములు దక్షిణ ఐరోపీయులు గ్రహియించుటయే తడవుగ, భారతదేశముతో వ్యాపారము సాగించుటకు కొలంబసును భారతదేశమునకు ప్రయాణముగావించిరి. ఈయన పడమటి వైపుగ ప్రయాణమొనర్చి, నూతన (అమెరికా)

ప్రపంచమును గనుగొని, దానినే భారతదేశ మనియు నందలి ప్రజలే భారతీయు లనియు తలంచెను. పోర్చుగీసులు వాస్కోడిగామా నిట్లే భారతదేశమునకు పంపగా నతడు వెడలి దక్షిణాఫ్రికాను చుట్టి మన దేశమును జేరి తన రాక నొక బంగరు పత్రముపై లిఖించి మన దేశ రాజునకు బంపెను.

"ఇది బుడతకీచులకు పవిత్రదినము. లిస్బన్ పట్టణమందలి గృహములన్నియు నారాత్రి దీపములతో నలంకరింపబడెను. మురుగు కాలువలుగూడ సారాయములతో బ్రవహించెను. వేడుకలకు వేయబడిన మంటలఫలితముగ నాకాశము-మైళ్లకొలది-ఎరుపుబాఱెను." —రీడ్.

భారతదేశమునకు సముద్ర మార్గము నన్వేషించి, యిచటి చక్రవర్తి సద్భావమును బడసిన ఐరోపీయులలో వీరే ప్రథములు కాన నమితోల్లాసమును బ్రదర్శించిరి. వీరి యానంద వినోదములకు బ్రబల కారణమేమి? వీరు భారతదేశమున గాంచినదెద్ది? ఆంగ్లేయులు మనదేశమున తమ పాద మిడిననాడు వారేమి గాంచిరో వీరు నద్దానినే గాంచిరి. ఆంగ్లేయులు మన దేశమున గాంచ గలిగిన దిదియే.

"నాగరిక ప్రపంచమున ప్రఖ్యాతి గాంచెడి ప్రతి వస్తువును సుందరకళామయమును, హస్తకౌశల నిర్మిత

మును. జీవిత వికాసముల నిరుజిమ్ము నిట్టి వస్తుసముదా యము భారత దేశమున నిర్మింపబడెను. ఈ దేశము వర్తక వ్యాపారములందు గాంచిన విఖ్యాతిని యూరపు ఆసియా ఖండములలో మరే దేశమును గాంచలేదు. నాగరిక ప్రపంచమం దంతటను భారతపు ప్రత్తి ఉన్ని, పట్టు, నార వస్త్రములు ప్రఖ్యాతిగాంచెను. ప్రశస్త భూష ణములు, వివిధ జాతుల రత్నములు, వన్నె చిన్నెల వాసి గాంచిన పలుపాత్రలు, వెండి బంగారములతో, ఉక్కు-లోహములతో గావింపబడిన వివిధ విచిత్ర వస్తువులతో కన్పడెను. పట్టణములు కళాశోభితములై మిగిలిన ప్రపంచ మును తలదన్నుచున్నవా! యనునట్లు గాన్పించెను. ఈ దేశము సముద్ర వ్యాపారమునందును, భూవ్యాపార మునందును తక్కిన నాగరిక ప్రపంచమును ధిక్కరించి వాసి గాంచెను."  —ఒక ప్రఖ్యాత అమెరికా వాసి.

ఈ నూతన సముద్ర మార్గము బుడతకీచులకు భారతీయులతో ప్రత్యక్ష వ్యాపారసంబంధము గల్పిం చెను. ఇందువలననే వెన్నిసు ప్రతిభ నశించెను. టైగ్రిసు, యూఫ్రెటిసు, నైలు మున్నగు పెద్ద నదీతీర పట్టణ ములు పాడుపడెను. భారతీయులు తయారుచేసిన పెక్కు వస్తువులకు లిస్బను పట్టనము ప్రఖ్యాత పణ్యభూమిగ మారెను. భారత సంబంధమే బుడతకీచుల భాగ్యమును,

ఆధిక్యమును బొంపొందించుటచే, నితర ఐరోపాజాతులు తమ దృష్టులను మన దేశమువంకకు మరల్చిరి. స్పెయిను దేశీయులు అమెరికా కేగియును భారతదేశమును మఱువ రైరి. పసిఫిక్ సముద్రము మీాదుగ భారతదేశాన్వేషణ మునకు గడంగిన మ్యాగలను జట్టు కొన్ని లంకలుగాంచి యవియే భారతదేశమని భ్రమించెను. ఇవియే ఫిలిప్పైను లంకలు.

భారతదేశమే వీరి మనస్సులందు సర్వదా మెలగుటచే వీ రెచ్చట నే దేశమును గాంచినను భారతదేశమే యని భావించిరి. పోర్చుగీసు, స్పెయిను నావికుల ననుసరించి డచ్చి, ఫరాసు, ఆంగ్లదేశీయులు భారతదేశమునకు ధన సంపాదనమునకై రాదొడంగిరి. వీ రెల్లర కాతిథ్యమొసగి, యైశ్వర్యవంతుల గావించినది మన భారతదేశమే. కాని యిచట ధనార్జన గావింప మొదలిడుటయే తడవుగ వీరిలో వీరికి స్పర్ధలు - పోటీలు పెచ్చు పెరిగెను. వీరు దేశమున నానావిధ కలహములు రేకెత్తించి ద్వేషములు పెంపొం దించిరి. కాని చివరకు అదృష్టదేవత యాంగ్లేయుల నావ హించెను. ఆంగ్లేయు లీ దేశమునకు ప్రభువులైన విషాద గాథలలో గర్వింపదగిన యంశ మేమియు లేదుగాని యనా మకమైన యాంగ్లదేశము భారతదేశము వలననే భాగ్య వంతమై, అధికార ప్రాభవమును బడసినదనుట సత్యదూర

ముగాని, అతిశయోక్తిగాని కానేరదు. దురహంకార ముచే దీని నాంగ్లేయులు సమ్మతింపకపోవచ్చును. వార డుగు పెట్టినదాది యీ దేశమును విచ్చలవిడిగ కొల్లగొట్టి భాగ్యవంతులైరి. ఆర్థిక తృష్ణచే మదాంధులై భారత నాగరికతా సంస్కృతుల చవిజూడనైరి. వీనిని గుర్తించి నచో తాము ను ఉన్నత నాగరికతను బడసి ప్రపంచమును దుఃఖమయముగ, ఈర్ష్యాద్వేషముల కాలవాలముగ గావింప కుండెడివారు. ప్రపంచము పరస్పర సఖ్య సహ లతో, శాంతి భద్రతలతో విరాజిల్లెడిది.

మన సంపదలతో భోగముల ననుభవించుచు, మన రాజ్యాధికారముతో సామ్రాజ్య సంపన్నులై మనలను మాత్రము దరిద్రులుగ జేసిరి. బానిసలుగ గావించిరి. అనాగరికులని వెక్కిరించిరి. ఇదియే వీరి కృతజ్ఞత. ఇక భారతీయులో! మన సంస్కృతీ నాగరికతలను, వివిధ విజ్ఞాన వికాసములను ప్రపంచమునం దంతటను విరివిగ విస్తరింపజేసి, ప్రపంచమునకు జ్యోతులవలె వెలుగొందిరి. ప్రాచీన గ్రీకు రోము పారసీక వాసులు భారతీయ నాగరి కతా సంస్కృతులను లెస్సగ గ్రహించిరి. ఈ దేశమున కేగుదెంచి విజ్ఞాన వికాసమును బెంపొందించుకొని ప్రఖ్యాతి గాంచిరి.

"జ్ఞానార్జనమునకు పైథాగరసునకుముందే గ్రీకులు భారతదేశమునకు పయనమైరి." —వాల్టేరు.

పైథాగరసు, ప్లేటోలు తత్వ శాస్త్ర పఠనమును భారతీయులకడనే గావించిరి. లియొన్ డి రోస్నీ, లిడ్విగ్ బచ్నర్, ఎమైల్ బర్నాఫ్, ఆర్థర్ లిల్లీ మున్నగువారెందరో క్రైస్తవమతమునకు ఉత్పత్తి కారణము భారతీయులే యని హృదయ పూర్వకముగ విశ్వసించిరి. తరువాత మతయుద్ధముల ఫలితముగ వికృత రూపము నందనిచో క్రైస్తవమతము నేటివలె నుండెడిది గాదు.

భారతీయుల కళాశాస్త్రములు, వారి వర్తక వ్యాపార నైపుణ్యము, సారస్వతము, తత్వశాస్త్రములు, గణిత ఖగోళ రసాయన వైద్య శాస్త్రములు ఖ్యాతిగాంచుటయే గాక అరబ్బులు, పారసీకులు వీనిని పఠించి తమదేశములందును, పాశ్చాత్య దేశములందును ప్రబలజేసిరి. భారతీయుల వ్యాపార వ్యవసాయ దక్షతనే యరబ్బులు నేర్చుకొని పాశ్చాత్యులకు ప్రసాదించిరి. అరబ్బులద్వారా పాశ్చాత్యులు భారతీయుల ధన ధాన్య వస్తు సంపదను, వ్యాపార విస్తరమును గ్రహించుటయే తడవుగ తమదేశమందు నిత్యము గావించుచున్న యుద్ధములను, దోపిళ్లను, ఓడదొంగతనములను జాలించి మూకలు మూకలుగ

భారత దేశమునకు ప్రాకదోఁకగిరి. భారత విజ్ఞాన వికాస ముల బడయగల పైథాగరెసు, ప్లేటోల వంటి జ్ఞాన పిపాసులనుగాక ఓడదొంగలను, దోపిడి గాండ్రను తండోప తండములుగ పాశ్చాత్యులు భారతదేశముపైకి పురికొల్పిరి. తమ దేశమందే పై యట్టి కృత్యములు గావించు వీరికి భారతదేశ ఆర్థిక సంపదతోగాక వైజ్ఞానిక సంపదతో నేమిపని ?

"మొదటినుండియు దూరదృష్టియు, హృదయాను కంపమును లేని ఘోరకిరాతులు, దోపిడి దొంగలు నీ పోర్చుగీసువారే. ప్రథమమున వారిచర్యల బ్రశంసించు టచేతనే వారి క్రూరకృత్యములను, అవినీతిని గాంచ జాలని యంధులమైతిమి. కాని కొలది కాలమునకే యీ క్రూరకృత్యముల నగ్నత - భీకర స్వరూపము స్పష్టముగ కన్నులకు గాన్పించెను. వీరు అరబ్బులను తెఱచాపలకు వ్రేలగట్టి సముద్రమున బాఱవైచిరి. పందిమాంసమును వేడివేడిగ వ్రేల్చి, వారి నాలుకల కంటించి ఘోరబాధలు పెట్టిరి. తమ సైనికుల కానందముగూర్ప నరబ్బులను మొసళ్ల కాహారముగ వైచిరి. శవలవైవగనే యీ యాహా రమునకు మొసళ్లు తమ మోరలు నీటి పై కెత్తికొని యుంచెడివి. అరబ్బులు దీనులై యరణ్యములందు పులుల చాటుననో, కొండచిలువల మాటుననో దాగియుండెడి

వారు. తల్లులచేత బిడ్డలను రోకళ్లతో మెత్త మెత్తగ దంపించెడివారు. భారతదేశమునకేగు పాశ్చాత్య వర్తకు లెల్లరు తమ మానవత్వమును, న్యాయమును కేప్ ఆఫ్ గుడ్ హోప్ వద్ద దాచిపోయెడివారు."—విన్ వుడ్ రీడ్.

ఇట్టివారికి మానవత్వము, న్యాయము లనునవి తమ దేశమున మాత్రమున్నవా! యని మా సంశయము.

ఇక నుత్తర ఐరోపీయుల విషయ మాలోచింపుడు. "అరణ్యమృగములను, చేపలనే గాక, ప్రత్యేకముగ మానవులను గూడ వేటాడు సాగ్జనులు, ఆంగ్లులు జూటులు, ఫ్రిజియనులు, డేనులు కత్తికటారులతో, బాకులతో ౫ వ శతాబ్దము వఱకు హిమమయ మైన బ్రిటీషు దీవుల నెట్లు స్వాధీన మొనర్చుకొని పాలించిరో మీరు ఒకసారి స్మరియింపుడు. వికృతాకృతులగు శ్వేతశరీరములు, దయాశూన్యము లయి భయంకరము లయిన నీలికన్నులు, జనుప పీచువంటి వెండ్రుకలు, మాంసము జున్నులతో నింపి, మత్తు సారాయములతో కాక యెక్కించిన కూళబొజ్జలు, శీతల హృదయములు, మందగమనము, మత్తుగ త్రాగి పశువులవలె గృహము లందు బడియుండు మాంద్య స్వభావము ఇవియే నేటికిని వంశక్రమానుగుణముగ, పరిస్థితుల ఫలితముగ బ్రదర్శించు వీరి లక్షణములు" —ఎడాల్ఫ్ హెయిన్.

"ఓడదొంగతనములు, మనుజుల వేట, తమ భూములను, స్త్రీలను బానిసల కప్పగించి సముద్రయానములు, యుద్ధములు, దోపిళ్లు గావించుటయే వీరి లక్షణములు. తమ పడవలలో సముద్రయానము గావించుచు, భోజన కాలములందు చేయు 'భారత దేశము నెట్లు దోచుకొందమా'! యన్న సంభాషణలను విన్నపుడే మనము (ఇంగ్లీషువారు) స్కాండినేవియా ఓడదొంగల సంతతివార మని గ్రహింపగలము. శతాబ్దములకొలది జరిగిన మన విద్యాభివృద్ధియు మన రక్తమును శుభ్రపరుపలేదు. భారతదేశమునం దొక సంస్థానాధిపతి వంకకుగాని, ఆయన రాజభవనము వంకకుగాని దృష్టి బ్రసరింపజేయుచు 'ఎంత యైశ్వర్యవంతు డీ ప్రభువు! ఎంత విలువగల దీ భవనము!' అని దోచుకొనుటకు మన వారు కేకలిడుదురు."

—సర్ చార్లెస్ డిల్కీ.

"...వీ రే తీరమున దిగినను నక్కడ గన్పించు వారి నెల్ల జంపెడివారు. తమ దేవతల కిట్లు బలు లొసగుచు, తాము కాల్చిన వస్తువుల యెఱ్ఱని మంటలతో, నచటినుండి మఱియొక ప్రాంతమున కట్టి ఘోర కృత్యములు గావించుట కేగెడివారు" —యం. జెయిన్.

ఈ ద్వివిధములగు దాడులకు భారతదేశము గుఱియాయెను. ఇట్టివారు భారతదేశమున భౌతిక సంపదను

గాక మరేమి గాంచగలరు ? పశుకృత్యముల బ్రదర్శించుట దప్ప మరియేమి చేయగలరు ? వాస్కోడిగామా కాలము నుండియు నిట్టి క్రూరులు, దురాశాపరులు మన దేశమున బ్రబలిరి. వీరి చర్యల ఫలితములను వేరుగ వ్రాయనలెనా!

వీరు భారత దేశమున బ్రవేశించుటయే తడవుగ వీరి సహజ స్వభావము, క్రూర కృత్యములు దెలియని భారతీయులు తమ మృదుస్వభావముతో వీరిని హృదయ పూర్వకముగ సత్కరించి యాదరించిరి. కాని వీరి క్రూర కృత్యములు బయటపడిన వెంటనే భారతీయులు విభ్రాంత మనస్కులైరి. అయ్యును వారికి పశుబలముతో జవాబీయ నెల్లరైరి. ఈ నీచభావములు మన నాగరికతకు, సాంప్రదాయమునకు దూరములుగదా !

పరదేశములందు తమ సరకులు విక్రయించుకొనుటకు భారతీయులు పశుబలమునుగాని, ఒత్తిడినిగాని బ్రయోగింపలేదు. వాని యమూల్య వస్తువుల సౌందర్య కాంతులచే నాకర్షింపబడియే పరులు వీనిని గ్రహించిరి. వీరి స్వభావములు, నాగరికతా లక్షణములు అహింసా సత్యములపై నాధారపడి యున్నవి.

"వీరు లోకములోనెల్ల నుత్తమ వణిజులు, సత్యవంతులు. ఏమిచ్చినను వీ రసృత మాడువారుకారు."

—మార్కోపోలో.

"భారతీయులకు సత్యమం దాదరణము గలదు. ఎట్టి వ్యవహారములందైన నింతింతనరాని విశ్వాస పాత్రులు."

—అబుల్ ఫజల్.

"సత్యసంధత కేవలము భారతీయుల సొమ్ము. అనృత వాక్యము నిట్లాదరించిన వా రన్యదేశములలో లేరు."

—ఫిల్లిమోరు

భారతదేశము పాశ్చాత్య ప్రపంచముననేగాక ప్రాగ్దేశములందును తనసంస్కృతీ నాగరికతలను, విజ్ఞాన వికాసములను స్వేచ్ఛగ వెదజల్లెను. చీనా, జపాను, సయాము, బోర్నియో, సుమత్రా మున్నగు దేశములెల్ల తమ సర్వ నాగరకతా లక్షణములు భారతీయులనుండి పడసి, వికసింపజేసికొనుటయేగాక నేటికిని భారతీయులయెడ తమ కృతజ్ఞతను బ్రకటించుచున్నవి. ప్రాగ్దేశీయులు తమకు సహనశీలత, అన్యోన్య ప్రేమ సహజమని ధ్రువపఱచుచున్నారు. భారతీయులు నేటికిని వారి హృదయముల నాచార్య పీఠము నధిష్ఠించుటచే భారతీయులయెడ వారి కింత కృతజ్ఞత గలదు.

గ్రీకులు, హూణులు, సిథియనులు మున్నగువారితో సంబంధ సంఘర్షణల ఫలితముగ భారతీయులు తమ నాగరికతా ప్రభావమును శాంతియుతముగ వారిపై బ్రసరింపజేసిరేగాని బలవంతముగ నంటగట్టలేదు. మహా

క్రైస్తవులు భారతీయులపై పెక్కు శతాబ్దములు కత్తితో క్రూరములగు దాడులు గావించిరి. వారి పవిత్ర దేవాలయములు పాడుచేసిరి. కట్టడములు కూలద్రోసిరి. గ్రంథరాజములు భస్మమొనర్చిరి. కాని భారతీయులు వారికి మసీదులు గట్టిపెట్టియు, సహనభావమును ప్రదర్శించియు వారిని తమ వారుగనే చూచుకొని నాగరిలిని, నాగరికతను వారికి ప్రసాదించిరి. చీనా, జపాను దేశముల బుద్ధభగవానుని పవిత్రధర్మము - అహింసా వ్రతము ప్రబలెనేగాని కన్ఫ్యూషియసు మతమునుగాని, షింటో మతమునుగాని పాఱద్రోలెనా ? వానిని గర్హించి దా[illegible] మును ప్రదర్శించెనా ? కాకపోగా పైపెచ్చు ఆయామత నాగరికతలకు వన్నెదెచ్చి శోభాయమాన మొనర్చెను.

సంస్కృతి యన సంఘమున లీనమై సర్వదా ఉన్నతికి ప్రవహించు నాచరణరూపము దాల్చిన భావ పరంపరయే గాని బలవంతముగ నంటగట్టు క్రూరకృత్యము గాదు. వాంఛల నీడేర్చు కామధేనువుగాని అరువోసగి యత్యాచారము లొనర్చు కఠోర హృదయము గాదు.

అమెరికా ఆఫ్రికాఖండములందలి పూర్వవాసులను పాశ్చాత్యులు నామరూపములు లేకుండ జేసిరే ? తా మేగిన తావులలో పరులను హింసించి, క్రూరవధలకు గురి

చేసిరే! ఏదీ! భారతీయు లట్లు గావించిన దృష్టాంత మొక్కటియైన జూపగలరా !

చంద్రగుప్తుడు, హర్షుడు, అశోకుడు విశాలమనస్సుతో, నైతికదృష్టితో న్యాయమును బరిపాలించి ప్రజాకళ్యాణము జేకూర్చిరేగాని అల్పమనస్సుతో, పశుబలముతో ప్రజలను బంధించి హింసించిరా? సత్యము స్వయంప్రకాశమానము. దాని కితర కాంతు లనవసరము. అవినీతికి, హైన్యత కిందు తావులేదు. భారతీయు లిట్టి నైతిక, ఆధ్యాత్మిక సత్యమునే ప్రబలజేసిరి. భారతదేశము పశుబల సంపన్నుల ధాటీ పరంపరల కాలవాలము గానిచో ప్రపంచము నేడు శాంతియుత జీవితముతో శోభిల్లి వర్ధిల్లెడిదే.

# స్త్రీలు

పాశ్చాత్యులలో పెక్కురకు భారత సంఘమును గూర్చి దురభిప్రాయములు, దురూహలు ప్రబలియున్నవి. కొలదిమంది భారతీయులును వీరి ననుకరించుచు వీరి భావములనే ప్రతిధ్వనింపజేయుట గర్హ్యము. ఇట్టి దురభిప్రాయములలో ప్రధానమైనది మన స్త్రీలను గూర్చి. సామాన్యమగు మానసిక ఔన్నత్యమును, ఔచిత్యమును గూడ బారద్రోలి, నీతి దూరులై, పశుభావములను బ్రదర్శించు ననాగరికులవలె వీరు మన స్త్రీలను విమర్శించుచున్నారు. తమ కంటి యద్దములరంగు వలెనే దృశ్యములు గూడ నుండును. తాము మదాంధులుగాన ప్రపంచము గూడ మదాంధముగనే గన్పించును. తృష్ణాబుద్ధితో శారీరిక సుఖముల గోరువారికి ఆంతరంగిక సౌందర్యమెట్లు గాన్పింపగలదు ? 'యద్భావమ్ తద్భవతి' 'భారతీయులు తమ స్త్రీలను బానిసలవలె నీచులుగ జూచుచుందు' రనియు, 'తుచ్ఛభోగముల కొఱకు యంత్రములవలె వినియోగించుకొనుచుందు'రనియు, 'ప్రపంచమందలి తక్కిన యన్ని జాతులకన్న భారతీయులు తమ స్త్రీలను న్యూనముగ, అగౌరవముగ జూచుచుందు'రనియు పెక్కురు

నుడివిరి. భారతీయ సంఘమును గాని, భారతీయ స్త్రీలనుగాని యేమియు నెఱుగని - తత్ స్వరూపమును దెలిసికొనసైన బ్రయత్నింపని పాశ్చాత్యు లిట్లు వ్రాయుట వారికిగల యీర్ష్యాద్వేషములను, అజ్ఞానమును జూపునే గాని సత్యాన్వేషణమునుగాని, విజ్ఞానమునుగాని జూపదు. వీరి వ్రాతలనే పెక్కు రుల్లేఖించి తమ గొప్పతనమును బ్రదర్శించుకొనుచుండుట, తమ మానసిక తృష్ణను దీర్చుకొనుచుండుట గర్హ్యము. ఈ విషయములు సహేతుకముగ విమర్శించి ఖండించుటకు పూర్వము పాశ్చాత్యులు తమ స్త్రీల నెట్లు చూచిరో తెలిసికొనుట యత్యావసరము. గ్రీసు, రోము మున్నగు దేశవాసులు తమ స్త్రీల నెక్కుడు మర్యాదగ జూచిరని పాశ్చాత్యులు విఱ్ఱవీగుచుందురు. కాన పాశ్చాత్య మహిళా సంఘస్థితి నిచ్చట కొంత వివరింతుము.

తామునగర్వించు గ్రీకు నాగరికతలో స్త్రీల యౌన్నత్యము నెచటను చరిత్ర పేర్కొనలేదు. అంతియకాదు; తద్విరుద్ధముగ ప్రాచీనకాలపు గ్రీకు స్త్రీలగతి చూడుడు. "స్త్రీలు పురుషులకంటె తక్కువ. వారు పురుషుల వాంఛల నెరవేర్చుటకును, బిడ్డలనుగను తల్లు లగుటకును మాత్రమే యున్నారు." —లూయిస్ డికిన్‌సన్.

"గుణసంపదగల గ్రీకు స్త్రీల స్థితియు సామాన్యముగ చాల నీచముగ నుండెను. ఆమె తన్ను గన్న తల్లిదండ్రు లకు దాసిగను, తన్ను బెండ్లాడిన భర్తకు నౌకరుగను, భర్త మరణించినచో దన బిడ్డలకు దాసిగను నుండెను."

—లేకీ.

"వివాహ మన బిడ్డల గనుటయే యనియు, స్పార్టా లోని వృద్ధులెల్లరును యౌవనవతులగు తమ భార్యలను బలాఢ్యులకు విడిచిపెట్టవలె ననియు, నందువలన దేశ రక్షణకు వలయు బలిష్ఠులగు సైనికులు సృష్టింప బడుదు రనియు భావింపబడెను."

రోమనులుగూడ నిట్లే స్త్రీలను అగౌరవముగ జూచుచు, కామతృష్ణతో బ్రదర్శించుచు, వారి నొకకంట జాగరూకతతో గనిపెట్టి యుండవలెనని ప్రకటించిరి.

పరస్త్రీలను తమ తల్లుల వలె భావింపక వారితో యథేచ్ఛముగా విహరించు నిచ్ఛతోడనే కొంత విహార స్వేచ్ఛను వారి కొసగిరి. వారి దేవుడే స్త్రీతో నిట్లనును. 'నీకు దుఃఖమును, ఎక్కువమంది బిడ్డలును గలుగుదురు. దుఃఖము తోడనే నీవు బిడ్డలను గనవలెను. నీ వాంఛలు నీ భర్తకొరకే. ఆయన నీపై యధికారమును చలా యించి రాజ్యము చేయును.' —బైబిలు.

ఏసుక్రీస్తు తన తల్లి నెట్టిదృష్టితో చూచెనో గ్రహించిన చో స్త్రీలయెడ వారికిగల దృష్టి స్పష్టమగును.

"స్త్రీ పురుషుని కణగి మణగియుండి, నిశ్శబ్దతయందే విజ్ఞానమును బడయవలెను. స్త్రీ బోధించుటకుగాని, పురుషులపై యధికారమును చలాయించుటకు గాని నే నొప్పుకొనను. ఆమె నిశ్శబ్దముగ నుండవలెను."

—బైబిలు.

"భార్యలారా! భగవంతునికివలెనే మీ భర్తలకు గూడ లొంగియుండుడు." "పురుషునికి శిరస్సు క్రీస్తు. స్త్రీకి శిరస్సు పురుషుడు." —సెంట్ పాల్.

"మానవుని పతనము గావించిన నీచస్వభావ స్త్రీయే" యని క్యాన్‌లా పేర్కొనుచున్నది. ఆమె 'దుర్బలనావ' 'పేడదిబ్బ' 'పైన దేవాలయము, క్రింద మురికికూపము' 'స్త్రీ దృష్టినుండి పారిపొమ్ము.' —చర్చి ఫాదర్సు.

పాదిరీల దృష్టిలోగల స్త్రీల స్థితినింకను గమనింపుడు. "స్త్రీలు నరకద్వారములు. సర్వరోగములకు, దుఃఖానుభవములకు పుట్టినిండ్లు. ఆమె తాను స్త్రీనని చెప్పుకొనుటకు సిగ్గుచెందవలెను. ప్రపంచమున కొసగిన శాపఫలితముగ ఆమె నిత్యము పశ్చాత్తప్త హృదయగనే జీవింపవలెను."

—లేకీ.

"స్త్రీ మెఱుగు నూనెలతో కప్పబడిన ప్రకృతిలోని నీచ వస్తువు' -క్రిసోస్టమ్.

"తాము మరణించువరకును బిడ్డలను గననిమ్ము. ఇందులకే వారు సృష్టింపబడిరి." —మార్టిన్ లూథర్.

ఈయన దృష్టిలో స్త్రీలు బిడ్డలను గను యంత్రములే యనుట నిశ్చయమే గదా!

"ఆంగ్లదేశమును నార్మనులు జయించిన కాలమున నాంగ్లస్త్రీలను కొని ఐర్లండులో మారుబేరమున కమ్ము నాచార ముండెడిది. కొన్నవారు యుక్తవయస్కులగు స్త్రీలను గర్భవతులుగచేసి విపణివీధులబెట్టి యెక్కువ ధనమును బడయుచుండిరి." —టెయినీ.

"బ్లాక్‌స్టన్ కాలమున నాంగ్ల శాస నానుసారము స్త్రీకి వివాహానంతరము వ్యక్తిత్వమే లేదు. ఆమెకు హక్కులనునవి లేవు. నార్మనులు జయించిన యనంతరము చాల కాలమువఱకు నామె తన భర్తకు కేవల ముంపుడు గత్తెయే. స్త్రీ తన భర్తను జంపినచో ఖూనీ నేరము క్రింద గాక తన రాజునకు ఎదురు దిరిగినదను నేరమును మోపి శిక్షించెడివారు. ఆమెను భర్త బాధించినచో నామెకు 'చర్చికోర్టు' మాత్రమే శరణ్యాము."

—జార్జి ఏ. డార్సే.

పారిశ్రామిక విప్లవకాలమువఱకు నాంగ్ల స్త్రీ యచ్చటి పురుషునకు బానిసయే. యంత్రాలయములు పెంపొందిన కొలది వానిలో స్త్రీలు ఎక్కువ పనులను చాకగ చేయగల నైపుణ్యమును బ్రదర్శించిరి. ఆర్థికముగ నిది లాభదాయకము గాన, స్త్రీల నెక్కువగ యంత్రాలయములలోని పనులకు వినియోగించిరి. కొంతమందికి పెద్దజీతములను, పెద్ద యుద్యోగములనుగూడ వీనియం దొసగిరి. ఇందు వలన స్త్రీలకు కొంత ఆర్థిక సౌష్ఠవము, స్వాతంత్ర్యము లభించెను. తత్ఫలితముగ నామెకు తన హక్కులను బ్రకటించు శక్తి గలిగెను. స్త్రీలు సంఘములు నేర్పఱచు కొని, తమ హక్కులను ధైర్యముగ వెలిబుచ్చుచు వాని కొఱకు పట్టుదలతో తీవ్ర కృషి గావించిరి. పురుషుల నెదిర్చి యొత్తిడి చేయసాగిరి. యంత్రాలయములందు ఆర్థిక నష్టము గలుగు నను భీతితో పురుషులు వారికి కొన్ని కొన్ని హక్కులను క్రమముగ నొసగసాగిరి. నైతిక సాంఘిక దృష్టులతో మాత్రము పాశ్చాత్య పురుషులు తమ స్త్రీల యభివృద్ధిని వాంఛింపలేదు. అందుకు స్త్రీలు తమ హక్కుల పోరాటము గావింపను లేదు. ఈ విషయమున కేవలము ఆర్థిక రాజకీయదృష్టులే ప్రాబల్యము వహించెను. తరువాత పురుషులతో సమానములగు హక్కులకు తీవ్రములగు పోరాటములు, బహి

పోరాటములు చేసి పెక్కు కష్టనష్టములకు గురియై తమ హక్కులను కొలది కాలము క్రితమే పడయ గలిగిరి.

ఇక భారతవర్షమున భారతీయ స్త్రీల విషయమాలో చింతుము. వైదిక కాలమున భారతసంఘమున స్త్రీలు గౌరవ స్థానము నలంకరించిరి. "యో భర్తా సా స్మృతాంగనా" భర్తయే స్త్రీ యని దీని భావము. అనగా స్త్రీ పురుషు లెప్పుడు నొక్కటియే. స్త్రీ యన నర్ధాంగి. పురుషునితో సమాన ప్రతిపత్తి, గౌరవము గలది. స్త్రీ లేనిచో పురుషుడెట్టి కర్మకాండగాని గావింపజాలడు. స్త్రీ యతనికి సహధర్మచారిణి.

సాంఘిక జీవనమున ప్రతి కార్యమునందును స్త్రీదే ప్రథమ స్థానము. భార్యా భర్తలు, మాతాపితృలు, సీతారాములు, రాధాకృష్ణులు ఇత్యాది పదములును ఆ ప్రథమ స్థానమునే చూపును.

"ప్రాచీన భారతీయుల వివాహ పద్ధతి యందలి పవిత్రత, గౌరవము, ఆశయము, ఆదర్శము ప్రపంచమునందలి మరి యే దేశమునగాని, మతమునగాని గాంచజాలము. సతీమణుల పాతివ్రత్యప్రభావమును, మాతృదేవతల స్వార్థరహిత త్యాగాలంకృత జీవిత మహిమను

లోకమున మఱచుటను గానము. స్త్రీ గృహమునకు పవిత్ర దేవత. గృహమునకు ప్రకాశవంతమగు జ్యోతి. గృహలక్ష్మి."
—అనిబిసెంటు.

"ప్రాచీన కాలమునందే దేశమును స్త్రీ లింత యున్నతస్థానము నందియుండలేదు. వారు మత ధర్మములన్నిటి యందును పురుషులతో సమాన స్థానము నలంకరించిరి. భారతీయుల వేదములందును పురుషుల వలెనే స్త్రీలు గూడ పెక్కు మంత్రములకు 'ద్రష్ట'లుగ నున్నారు. ఈ స్త్రీలను బ్రహ్మవాదినులు (బ్రహ్మను బ్రకటించువారు) అని నుడివెడివారు. వీరు మతమును గూర్చి తర్కించి విమర్శించుటకును, ఇతరుల కద్దానిని బోధించుటకును సర్వస్వాతంత్ర్యములు గలిగి యుండిరి."
-విల్సన్.

"ఇమం మంత్రమ్ పత్నీ పఠేత్" —శ్రౌత సూత్రము.

"బ్రహ్మచర్యేణ కన్యా యువానం విందతే పతిమ్"
—అథర్వము.

వివాహ కాలమున భార్యా భర్త లిరువురును వైదిక మంత్రములను స్వయముగ నుచ్చరింపవలెను. "భార్యాభర్త లోకేపదార్థమునందలి రెండు భాగములు. కావున వారు ప్రతి విషయమునందును సమానులే.

ఇహలోకాముష్మిక విషయములన్నిటియందును ఉభయులు సమముగా కృషి గావింపవలెను." —సాయనాచార్యులు.

పురుషుడు యజ్ఞప్రధానుడు గాన లౌకిక వృత్తులన్నిటి యందును పాటుపడవలెను. స్త్రీ తపః ప్రధాన గాన ఆత్మ ప్రధానము, త్యాగ భావములందు ప్రాధాన్యము వహించును. మైత్రేయి, గార్గి మున్నగు స్త్రీ రత్నములు మత పరిషత్తులలో, బ్రహ్మజ్ఞాన విచారణలలో పురుషులతో సమానముగా తర్క వితర్కములు గావించి విషయ నిర్ణయముల నొనర్చిరి. బ్రహ్మచర్య వ్రతము స్త్రీ పురుషులకు సమానము. లోపాముద్ర, అపాలకన్య, గార్గి, మైత్రేయి మున్నగువారు వేదముల బఠించి ముని వృత్తిని బూనిరి. వాచక్నవి, బడబ, ప్రాతిథేయి, సులభ మున్నగు స్త్రీలాచార్య పీఠము నధిష్ఠించిరి.

"భార్య తన భర్తను ప్రేమించుట యాతని దేహము కొరకు గాక దాని యందలి యాత్మకొరకే. భర్త భార్యను ప్రేమించుట యాశరీరము కొఱకు గాక దాని యందలి యాత్మమూలముననే" యని యాజ్ఞవల్క్యుడు తన భార్యయగు మైత్రేయికి బోధించెను.

ఆనాటి స్త్రీలు బ్రహ్మవిద్యనేగాక క్షాత్రమునుగూడ ప్రదర్శించి, పెక్కు యుద్ధములు గావించి, శత్రువుల

నోడించి రనుటకు ఋగ్వేదమునందు బెక్కు ఆధారములు గలవు. పురాణ కాలమునగూడ స్త్రీలు ఉన్నత స్థానము నధిష్ఠించిరి.

"ఆమెకు స్వవిషయము లన్నిటియందును పరిపూర్ణ స్వాతంత్ర్యము గలదు. స్వాతంత్ర్యోద్యమమునందు నేటి స్త్రీ పలవరించు విపరీత స్వప్నములకంటె మేలుగ నాటి కాంత పురుషునితో సమానమగు హక్కులు గలిగి యుండెను." —ప్రిన్సిపాల్ జార్జి హా వెల్సు.

రామాయణమునందలి సీత, భారతమునందలి దమయంతి ప్రవర్తనములను గూర్చి యమ్. ఏ. బారన్ గ్వెరర్ డి డుమాస్టు ఇట్లు నుడివెను.

"గ్రీకులు, రోమనులు – మహాకవులగు హెూమర్ గాని, వర్జిల్ గాని – యూహింపజాలని స్త్రీల యౌన్నత్యమును, ప్రాశస్త్యమును, సౌకుమార్యమును తమ తమ రచించిన సంస్కృత సారస్వతమునందు భారతీయ కవులు వర్ణించి యుండిరి. భారతీయ సంఘమునందు స్త్రీల కిట్టి పవిత్ర స్థానమే లేనిచో నీకవు లట్లు లిఖియించియే యుండ జాలరు. దీనిని నమ్మకుండుట మూర్ఖత్వము. అవివేకము. భగవంతుడు శూన్యమునుండి తన సృష్టి నెట్లు గావింప లేదో అట్లే యేమియు లేనిదే యీ కవులు గూడ నిట్లు లిఖియించి యుండజాలరు."

సంఘమున కవుల వర్ణనలకు పాత్రములయిన యిట్టి సత్స్త్రీ సత్పురుషులు వారికి హక్కులు, బాధ్యతలు, ధర్మములు లేకయే కల్పనని వచియింపనగునా? విధిబాధ్యతలు లేకయున్న వారు సంఘమున సృష్టియగుదురా? క్షత్రియ స్త్రీలు ధనుర్వేదము నభ్యసించి యుద్ధములు గావించుటకును నైపుణ్యము బడసి యుండిరి. కైకేయీ సత్యభామాదులు చేసిన రణముల మాట నొక్క మారు స్మరియింపుడు.

కుంతీదేవి తన కుమారులగు పాండవులను జూచి పలికిన పల్కులు గమనింపుడు.

"క్షత్రియ స్త్రీ తన కుమారులగని పెంచిన దినములకే. (ధర్మయుద్ధములు గావించుటకే) కావున వీరులవలె శత్రువులతో యుద్ధము చేసి జయమును బడయుడు."

ఇట్లే గాంధారీదేవి తన పుత్రుడగు దుర్యోధనున కెన్నియో నీతులను, సలహాల నొసగెను. భారతీయులు తమ స్త్రీల నున్నత స్థానమున నునిచి, సమాన గౌరవ మర్యాద లొసగనిచో తమ దేవతలతోబాటు స్త్రీల నున్నత శిఖరమున నుంచజాలరు. కాళికాదేవి ఆదిశక్తి. లక్ష్మి సిరిసంపదల కధిష్ఠానదేవత. సరస్వతి విద్యాదేవత. ఆదర్శ జ్ఞానమూర్తి. మానవుని జీవితమునందు శక్తి,

సంపద, విజ్ఞానములు నమూల్యములుగదా ! ఈ సంపద లన్నియు స్త్రీలవే యన్న నిక స్త్రీల యౌన్నత్యమును వేరుగ వచియింపవలయునా ! స్త్రీకి శక్తిసామర్థ్యములు, గౌరవ మర్యాదలు లేనిచో సంఘము నం దిట్టి యున్నత స్థానములను పురుషులచేబడయుట యసంభవముగాదా !

మనుస్మృతి స్త్రీ స్వాతంత్ర్యములో కొంత జోక్యము గలిగించుకొన్న దనుట వాస్తవమే. కాని ఆ మనువే "స్త్రీలు గౌరవింపబడు తావులందే దేవతలు సంతసింతురు. వీరిని గౌరవింపనిచో మతకర్మము లన్నియు నిష్ఫల ములు. స్త్రీలు దుఃఖించు కుటుంబములు త్వరలోనే నశించును. వారు సుఖించుకుటుంబములు సుఖసంపద లతో తులదూగును."

"నూరు తప్పులు గావించిన భార్యనుగూడ భర్త పుష్పములతో నైనను కొట్టజనదు."

"వేయిమంది తండ్రులకన్న మిన్నగ తల్లిని పూజింప వలెను."

భారతీయునకు మాతృదేవతను మించిన దేవతలేదు."

"జననియు,జన్మభూమియు స్వర్గమునకన్న మిన్నలు." అని యిట్లు పెక్కువిధముల ఘంటాపథముగ జెప్పి యున్నాడు. కనుక నే స్త్రీ స్వాతంత్ర్యమును కుంచించుచు

మనువు పేరనున్న శ్లోకములు సంకుచిత బుద్ధు లెవరో తరువాత చేర్చియుందురని పండితులు కొందరు చెప్పుచుండుట వాస్తవమే యయి యుండవచ్చును.

పవిత్రాదర్శములకు ఆలవాలములు, ఆదర్శ చరిత్రలు నగు సీత, సావిత్రి, దమయంతి మున్నగు మహా పతివ్రతలీ భారత దేశమున నెందరెందరో యుద్భవిల్లిరి.

బుద్ధుని కాలమునను, బౌద్ధమతమునను స్త్రీలు పురుషులతో సమానోన్నత స్థానము నలంకరించి రాణించిరి.

"బాలికలకు సామాన్య విద్య, శాస్త్రములు, కళలు గూడ నేర్పెడివారు. గృహములు, రాజభవనములు వీరిచే చిత్రింపబడి, యలంకృతములై నృత్య గాన కళలతో నానందమును వెదజల్లుచుండెడివి." —క్లారిసే బేడరు.

"కాళిదాసు దేవకళ నొక స్త్రీకి బోధించెను."
—స్త్రీబోధ.

ఖన్నా లీలావతులు జగత్ప్రఖ్యాతిని గాంచిరి. ఖన్నా రచియించిన ఖగోళశాస్త్రము, లీలావతి గణితశాస్త్రము నేటి శాస్త్రవేత్తలచే **గూడ** పఠింపబడుచున్నవి. మండన మిశ్రునితో నాత్మవిషయమున శంకరాచార్యులు వాదింప బూనినపుడు తమ జయాపజయముల నిర్ణయింప మండన మిశ్రుని భార్య యగు 'విద్యాభారతి' (ఉభయభారతి) నే

మధ్యవర్తినిగ నియమించిరి. ఇంతటి పరమ గూఢమగు తాత్త్వక విషయమును జర్చించు మహాసమావేశమునకు న్యాయమూర్తిగ నొక స్త్రీని నియమించుటను ప్రపంచమున మరేదేశమునందైన గాంచగలమా!

ఆ కాలమున నాటక కళను స్త్రీలే పోషించిరి. ప్రాచీన కాలమున సాంఘిక జీవిత నాటకములు ప్రదర్శించుటలో గౌరవ కుటుంబముల స్త్రీలు పాల్గొని నటించినది ఒక్క భారతదేశమున మాత్రమే. ఈదేశమున ఆర్థికముగ గూడ స్త్రీది యగ్రస్థానమే. పాడి పశువుల పోషణయు, వాని వలన లభించు పాలు, పెరుగు, నేయి మున్నగు వస్తువులును స్త్రీ స్వాధీనములు. గృహపరిశ్రమలు, పూలతోటలు స్త్రీ యధీనములు. రాట్నము స్త్రీ హస్తగతము. పాడి పశువులును, రాట్నములును ఏనాడు స్త్రీ హస్తగతములో ఆనాడే ఆర్థిక సంపద స్త్రీ స్వాధీనమున నుండక తప్పదు. 'కదురాడినను, కవ్వమాడినను కఱవు లేదు' అను సామెత జగద్విదితము. ఋతు ధర్మములు సక్రమముగ నడువక పోయినను, కాలమానము సరిలేక పంటలు పండక పోయినను, పాలు మాత్రమే గ్రోలి ఆరోగ్యవంతమగు సుఖ జీవితమును గడపవచ్చునుగదా! ఇష్టే ఎట్టి భోగములు లేకపోయినను, రాట్నచక్రముచే లభించు నూలు తోడ నేసిన కొల్లాయులైన ధరించి

మానము గాపాడుకొనవచ్చును. కాబట్టి మాన ప్రాణముల గాపాడు నీ రెండువృత్తులును స్త్రీ చేతి కొప్పగింపబడుటలోని భావ విశేషమును గమనింపుడు. కుటుంబ జీవిత నిర్వహణము, తద్ద్వారవపోషణము స్త్రీ హస్తమున నుంచుట యందలి భారతీయుల పవిత్రాదర్శము ప్రశంసనీయము గాదా !

'అర్థస్యసంగ్రహేచైనాం,వ్యయేచైవనియోజయేత్' మనువు

"గృహ దేవాలయమున త్రికాలములందును పూజలు, నిత్యకర్మములు, దానాది సత్క్రియలు జరపును. కుటుంబభారమును పత్నియే తలదాల్చును. ఆదాయము నెఱిగి, దాని కనుగుణముగ వ్యయ మొనర్చును. దైనికాదాయ వ్యయముల నెప్పటికప్పుడు సరిచూచుచుండును.

పతి తన యాదాయమునకు మించిన వ్యయమొనర్చినచో సతి గృహమున వానిని మందలించి నిరోధించును. అవసరమగు సంబారముల నెల్ల సేకరించి, కూడబెట్టి సక్రమముగ వినియోగించుచుండును. గృహనిర్వహణ కార్యమందామె సిద్ధహస్త. ఆమె స్వీయగృహపరిచారకుల జీతములు చెల్లించి, సేద్యమునకు వలయు వ్యవస్థయు సలిపి, పశువులను లెస్సగ గాపాడి పెంపుడు పిట్టలను, జంతువులను జాగ్రత్తగ పోషించును. ఇంటి తోటను

క్రమముగ పాలించి ఫలదాయకముగా జేయును. తన పతి యింట లేనపుడతని వ్యాపారముల నెల్ల చక్కదిద్దును. యజమాని లేని లోప మేమాత్రమును గలుగనీయదు. ఇంట మితవ్యయ మొనర్చును. క్రయవిక్రయములు పరిచారికల సహాయముతో సలిపి యాదాయమును వృద్ధిచేయును. వంటయింటి పనిని మాత్రము తానే జరుపుకొనును. తీరిక వేళలందు నూలువడుకును. బట్టలు నేయును. ఆర్థికముగ, మానసికముగ, నైతికముగ, ఆధ్యాత్మికముగ పరిపూర్ణత్వమునందిన సీమంతినీ చూడామణి ఆమెయే.' -వాత్స్యాయనుడు.

మహమ్మదీయుల కాలమునగూడ భారతీయ స్త్రీలు తమ పురుషులతో బాటు పౌరుష,సాహసముల బ్రదర్శించి యుద్ధములు గావించిరి. జయము గల్గుదాక - లేక - ప్రాణములున్నంత దనుక వెన్నుజూపక శత్రువులతో యుద్ధములు గావింపుడని తమ భర్తలకు ప్రబోధము గావించి ప్రోత్సహించినది స్త్రీలే. యుద్ధమునుండి వెనుదిరిగి వచ్చిన రణతిక్కనకు అతని భార్య యొసగిన సమాధానమును స్మరింపుడు. అక్బరు నెదిర్చి అహమ్మదు నగరపు కోటను రక్షించిన చాందుబీబీ పౌరుషము నెఱుగమా? క్షత్రియాంగనలు తమ మానరక్షణార్థము తమ ప్రాణములను నగుమోములతో జోహారులలో నర్పించిన గాథలు పెక్కు

గలవు. జిజియాబాయి శివాజీ పౌరుషము నుగ్గుబాలతో పోషించి పెంపొందింపలేదా ? కాని దురదృష్టవశమున రానురాను మహమ్మదీయుల దాడుల, క్రూరకృత్యముల ఫలితముగనే కాబోలు హిందువులలో కొందరు తమ స్త్రీలకు ముసుగువేయు నాచారమునకు లోనైరి. ఇది కేవలము స్త్రీల తాత్కాలిక రక్షణమునకే గాని వారి నావనత స్థితికి దింపుటకు మాత్రముగాదు. క్రమముగ పాశ్చాత్యు లీ దేశమున బ్రవేశించి దేశము నాక్రమింప మొదలిడిరి. ఆ సమయమునగూడ ఝాన్సీలక్ష్మీబాయి వంటి వీర వనితలు చూపిన యభిమానౌన్నత్యమును మన మెరుగుదుముగదా! బెన్‌టిక్ ప్రభువు రంజిత సింగును జూచుటకు పంజాబున కేగినపుడు డెబ్బదిమంది స్త్రీలు పసుపు పచ్చని చీరలు ధరించి, హస్తములందు బెత్తములుపూని యొక స్త్రీ నాయకత్వమున స్వాగత మొసగిరి. భారతీయ జీవన పథము, జీవిత వికాసము, చరిత్ర కేవలము పురుషులవలననేగాక స్త్రీపురుషు లుభయుల వలనను ఉన్నతి నందినవి. స్త్రీలు పురుషుల ననుకరించుటగాని, వారితో పోటీపడుటగాని భారత సాంప్రదాయమున గానము. నేటికిని సర్వ విషయములందును పురుషులతో బాటు స్త్రీలును అభివృద్ధినొంద కృషి గావించుచునే యున్నారు. ౧౯౧౯ సం॥న ఆంగ్లప్రభు

వులు తమ స్త్రీలకు స్వల్పాధికారములుగల సంస్కరణ భిక్ష పెట్టిరి. కాని యందు స్త్రీలకు సమ్మతుల నొసగు నర్హతయు లేదు. దీనిని గర్హించుచు భారతీయస్త్రీపురుషు లెల్లరు పెక్కు విజ్ఞప్తు 'లాంగ్లపార్లమెంటు'నకు బంపిరి. వీని ఫలితముగ నాంగ్లేయులు తాము మాత్రము తమ స్త్రీలకు 'వోటు హక్కు' నీయు మనియు, భారతీయుల కిష్టమైనచో వారి స్త్రీల కిచ్చుకొనవచ్చుననియు నొక శాసనమును భారతీయ పురుషుల బరీక్షించుటకో యను నిట్లు గావించిరి. వెంటనే యొక సంస్థానాధిపతి తన సమ్మతిని బ్రకటించెను. తరువాత రాష్ట్ర శాసనసభలు, నితర సంస్థానములు స్త్రీల యర్హత నంగీకరించుచు శాసనముల గావించెను. ఈ సందర్భమున ఆంగ్లదేశపు గ్యాడ్సన్ కన్య తన యాశ్చర్యము నిట్లు ప్రకటించెను.

"అత్యల్పకాలమున - పదునొకండు వత్సరములలో భారతీయ స్త్రీలు తొమ్మిది రాష్ట్రములందును, నాలుగు సంస్థానములందును తమ సమ్మతుల నొసగు నధికారమును బడసిరి."

భారత స్త్రీలు తమ పురుషులయెడ నసభ్య ప్రచారమునుగాని, ఆందోళనమునుగాని సలుపలేదు. పురుషులును వెంటనే హృదయపూర్వకముగ స్త్రీ సమానత్వ

మామోదించిరి. ఈ విజయమునుగాంచి గ్యాడ్‌సన్ కన్య యిట్లు నుడివెను.

“హిందూమహమ్మదీయ మతములు తమ స్త్రీల యెడల బ్రకటించిన పవిత్రప్రేమ, స్త్రీ దేవతలకు పురుషు లొసగిన ప్రాధాన్యము, బ్రాహ్మణులు తమ భార్యలతో సహా క్రతువులు గావించుట ఘోషాలోగూడ గూఢ మగు పవిత్రతను బ్రకటించుటయే.”

ఆంగ్లపాలనాఫలితముగ దేశము అజ్ఞానమయ మాయెను. భారత విజ్ఞానమును బ్రదర్శించు సహజప్రేమను ఆంగ్లప్రభువులు నిరాదరణ దృష్టితో జూచిరి. వారు మనకు సక్రమ విద్య నొసగలేదు. ఈ విద్యను బడయుట కైనను అత్యల్పావకాశమును మాత్రమే యొసగిరి. ఇట్టి నిరాకృతస్థితియందును మన స్త్రీలు ఉన్నత విద్యల నభ్యసించి, వైద్యురాండ్రుగ, న్యాయవాదినులుగ, కవయిత్రులుగ నున్నారు.

ఒక స్త్రీ చెన్నరాష్ట్ర శాసన సభకు ఉపాధ్యక్షురాలుగ (శ్రీమతి రుక్మిణీ లక్ష్మీపతి) ఎన్నికొన బడెను. వేరొక స్త్రీ సంయుక్త పరగణాలలో మంత్రిణి (శ్రీ విజయలక్ష్మి పండిట్) యాయెను. శాసనసభల సభ్యురాండ్రుగ, స్థానిక సంస్థల సభ్యురాండ్రుగ పెక్కురు స్త్రీలు గలరు. గౌరవ

కుటుంబములకు జెందిన స్త్రీరత్నములు పురుషుల కేమియు తగ్గకుండ - వేలకు వేలు - మహాత్ముని నాయకత్వమున కాంగ్రెసు ఆదేశాను సారముగ నడుపబడిన సహాయ నిరాకరణోద్యమమున తీవ్రముగ పాల్గొని, పర ప్రభుత్వ ముచే నీచముగ హింసింప బడియు కారాగారముల నలంక రించిరి.

భగల్పూరు సంస్థాన వాసినియగు నొక సతీమణి ఆక్సు ఫర్డునందు ఉన్నత విద్యను బడసి పెక్కు పాశ్చాత్య దేశ ముల పర్యటన మొనర్చి, స్త్రీ సంఘములందు కృషి గావించి తన యనుభవముల నిట్లు ప్రకటించెను.

"భారత జాతీయ జీవితమునందును, తద్వికాసము నందును తమ స్త్రీలు పాల్గొని, కృషి గావించుట సహజ మని మా పురుషులు భావింతురు. పాశ్చాత్యులవలె స్త్రీలను తమకు ప్రతిస్పర్ధులుగ మా పురుషులు దలంపరు. భారతీయులకు స్త్రీలు సహధర్మ చారిణులు. ప్రతి కార్య మును స్త్రీతో గూడ గావింపవలెను. స్త్రీల కృషికి, ఔన్నత్యమునకు మహాత్మాగాంధిచే నడపబడిన జాతీ యోద్యమము చక్కని సక్రమ ప్రోత్సాహము నొసగినది. గాంధీజీయుద్యమము స్త్రీలను రాజకీయరంగమునదింపెను. గృహపరిశ్రమలను పునరుద్ధరించి, యభివృద్ధికి దెచ్చుటకు

కృషి గావించినది స్త్రీలే. వారే పౌరధర్మమును నిర్వహించుచు, తమ బాధ్యతను గమనించుటయేతడవుగ ముందంజ వైచి తమ దేశమును తాము చక్కగ పాలించుకొనగల మని ప్రకటించిరి. స్త్రీలు పరిపాలనా దక్షత గలిగి, తన్నిర్వహణమునకు బూననిదే యేదేశముగాని యభివృద్ధి బడయజాలదని విశ్వసించువారిలో భారతీయు లగ్రస్థానము నలంకరింతురు. మేము శాసనసభలకు సమ్మతులిచ్చు నర్హత బడసితిమి. ఒక సంవత్సరములోనే ఆస్తి, విద్యలందలి తారతమ్యముల బాఅద్రోలి సంపూర్ణాధికారములు పురుషులతో సమానముగ గలిగి యుందుము. దేశమున నేడు ఏబదికిమించిన స్త్రీల సంఘములు గలవు. ఇవియెల్లను అ. భా. స్త్రీ సంస్థకు లోబడి యద్దాని యభివృద్ధికి దోహద మొసగుచున్నవి. సాంఘిక సభలందు లలిత కళలు, వివాహ సమస్యలు, కార్మిక స్త్రీలయు, వారి పిల్లలయు సమస్యలు చర్చించి పరిష్కరింప బడుచున్నవి. మాలో డాక్టర్లు, కళాకోవిదలు, కవయిత్రులు గలరు. ఇదంతయు భారతీయ స్వాతంత్ర్యమునకు, అభ్యుదయమునకు, వికాసమునకు స్త్రీ యొసగుచున్న దోహదము. ఇది శుభ చిహ్నము."

స్త్రీలయెడ భారతీయులు చూపు గౌర వాద రాభిమానములకు పై వాక్యము లద్దములు.

భారతీయులకు మాతయే పరమ దైవము. ఆమెయే పూజనీయ. 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' 'నమాతుః పరదైవతమ్' 'మాతృదేవోభవ' ఇవియే మన ఉత్కృష్టాదర్శములు. శిశువులను బాల్యమున లాలించి పాలనచేయునది మాతయే. అడలుపాటున గాక ఆద రానురాగములతో జీవితమును వికసింపజేయు విశాల హృదయము మాతృదేవతదే. ఉన్నత భావము లను, ఆలోచనములను, ఆదర్శములను గోరు ముద్దలుగ దినిపించునది మాతృదేవియే. మాతృగర్భము ఆనందము నకు గంగోత్తరి. 'ఊయెల నూపుచేయియే యుర్వీమండ లము నూపును.'

పాశ్చాత్య స్త్రీలు తమ పురుషులతో పోరాడి, పోటీ పడి తమ రాజకీయ స్వత్వముల బడసిరి. కాని భారతీయ స్త్రీలో! తమ పురుషుల పరస్పర సహన సహకారము లతో సమానత్వమును బడసిరి. ఇదియు కేవలము పాశ్చాత్య స్త్రీలవలె రాజకీయము గాక నైతికము. నైతికపు పునాదియే జీవితమున కాయువుపట్టు.

సంఘమున వ్యక్తి స్వతంత్రించి నిలువజాలడు. పర స్పర సహకార మవసరము. ఈ సహకార వికాసము భారతీయులకు ప్రాచీన కాలమునుండియు వంశ పరంపరా

గతము. పరస్పరస్నేహ సహనములుగలచోట హైన్యము లేదు. హైన్యములేక అసమానత్వము ఎట్లుండగలదు ? అసమానత్వములేని తావున సమానత్వపు ప్రశ్నకే తావులేదు. ఇక పాశ్చాత్యులలో స్త్రీ పురుష సమాన భావము నిన్న మొన్నటిది. ఇదియును హక్కులసిద్ధాంత ముపై నేర్పడెను. నీతికన్న రాజకీయమునకు ప్రాధాన్య మొసగు పాశ్చాత్య సంఘమునందు మానవ సంబంధము లొక యొడంబడిక వంటివి. పరస్పర వైరుధ్యమును బాపుకొని రక్షణకు దోడ్పడు భావమే యుండ గలదు. ఇది యున్నత నాగరికతను బ్రదర్శింపదు.

స్త్రీ పురుషులు సహజ ప్రేమచే నాకర్షింపబడుటయే నిక్కమగు నాగరికత. స్త్రీ లేని పురుషుడును, పురుషుడు లేని స్త్రీయు నసంపూర్ణతను బ్రకటింతురు. ప్రకృతి స్త్రీ పురుషుల నొకే పదార్థమునుండి సృష్టించెను.

'నీవు నాకది చేసిన నేను నీకిది చేసెద' నను వ్యాపార సమస్యకిందు తావులేదు. వీరిరువురి యైక్యమే ప్రకృతి సహజ లక్షణము. వీరి పరస్పర సమ్మేళనమే సంఘ జీవన తత్త్వము. ఈ సమ్మేళనము ప్రేమచేతనే సాధ్యమగును. ప్రేమ తత్త్వముచే బంధింపబడినవారు హక్కులకు దేవు లాడక ధర్మమును నిర్వహింప నభిలషింతురు. స్వార్థ

త్యాగమునకు ప్రేమయే మూలము. నాగరిక సంఘము ధర్మ సిద్ధాంతముల మీదనే యాధారపడి యుండును. ధర్మసిద్ధాంతమున కాధారము విశాల ప్రేమయే గదా !

'వీనికేమి ? భారతీయ సంఘమున నేటి స్త్రీ స్థితి యేమి ? ఆమెను పురుషుడు హైన్యముగ జూచుటలేదా ? తన సౌఖ్యమునకు సాధనముగ వినియోగించుకొనుట లేదా ? పురుషులు స్త్రీల నణగ ద్రొక్కుచున్నపుడు వారు తమ హక్కులకు బోరాడవలదా ? ఇది న్యాయము గాదా ?' అని నవీనులు ప్రశ్నింతురు. ఇది యుచితమే. దురదృష్ట వశమున నేటి భారతీయ సంఘము హీనస్థితికి దిగి స్త్రీని తక్కువగ జూచుచున్నది. ఏమాత్ర మింగిత జ్ఞానము గలవారుగాని, హృదయ వికాసము గలవారు గాని యీ స్థితి నామోదింపరు. నేడు పెక్కురు పురుషులు తమ తప్పిదమును గ్రహించి స్త్రీల సమానత్వము నకు కృషి గావించుచున్నారు. కేవలము స్త్రీలే కృషి గావించి సమానత్వము బడయుట కష్టము. పరస్పర సహకారములు వాంఛనీయములు. కాని రాజకీయాధికార ములు పడసినంత మాత్రముననే సమానత్వము వర్ధిల్లదు. సంఘమున నెన్నియో సమస్యలు గలవు. ఇవి యెల్లను సంస్కరింపబడి సక్రమముగ పరిష్కరింప బడవలెనన్న పరస్పరానురాగ మత్యవసరము. ఈ యసమానత్వ

మును బరిష్కరింప గలిగినది — రూపుమాపగలిగినది నీతియే - ధర్మమే. నీతికి - ధర్మమునకు ప్రేమ యత్యావసరము, మూలాధారము. ఇది ప్రబలిన వెంటనే యసమానత్వము పటాపంచలై ఐక్యభావము దేదీప్యమానముగ వెలుగొందుననుటలో సందియము లేదు. అప్పుడు భారతము ఉన్నతి దిశ కింకొక మెట్టెక్కినట్లగును.

# త్రివేణీ సంగమము

గంగా యమునా సరస్వతీనదులు మూడును ప్రయాగ వద్ద కలియుచోటును త్రివేణి యందుము. ఇందు గంగా యమునలు ప్రత్యక్ష ప్రవాహములు. జీవము శరీరము నందు నిక్షిప్తమై దాని కతీతముగ నుండునట్లు సరస్వతీ నదియు నంతర్వాహినియై స్థూలదృష్టికి గానరాక యుండును. అది కంటికి గన్పింపకపోయినను దాని యునికి విశదమే. ఇందు గంగ జ్ఞాన ప్రధానము. యమునభక్తి ప్రధానము. ఈ జ్ఞానభక్తులకు గమ్యస్థానము - సంగమ స్థానము ఆత్మయే. అనగా సరస్వతియే యన్నమాట. ఆత్మ స్థూలదృష్టి కగోచరము. ఇంద్రియాతీతము. బ్రహ్మా,విష్ణు, మహేశ్వరుల భాగములే సరస్వతీ యమునా గంగలు. బ్రహ్మా-ఆత్మ-సర్వాంతర్యామియేకాక, ఆయన భార్య సరస్వతియు నంతర్యామినియై స్థూలదృష్టి కగోచరముగ నున్నది. గంగ శివుని భార్య. జ్ఞాన ప్రాధాన్యమునుసూచించును. అనగానద్వైత దృష్టిని బ్రదర్శించుచు స్వరూపైక్యమును బోధించును. విష్ణువు పోషకమూర్తి, ప్రేమస్వరూపుడుగాన లోక కళ్యాణార్థమై అవతరించుచుండును. అదియేయమునాస్వరూపము. యమున విశిష్టై.

క్యమును బోధించును. వీని గాథలు భారతీయుల భ_
తత్త్వమును ప్రకటించును. ఇవి స్వచ్ఛతర రజిత వర్ణ
మగు హిమాలయములనుండి తళతళలాడు కాంతులతో
పృథ్వీతలమున ప్రవహించుచున్నవి. ఈ ప్రకృతి సుందర
దృశ్యము భారతీయుని మానస వికాసమును వెల్లడించును.

పవిత్ర గంగానది భారతీయ విజ్ఞానమును, ఋషుల
యమోఘ తపఃఫలమును ప్రదర్శించును. పెక్కురు
ఋషు లీ నదీతీరమున కృతార్థులయిరి. వారిచట తమ
తీవ్ర తపో మహిమచే ప్రత్యక్ష మొనర్చుకొన్న పెక్కు
సత్యములను ప్రకటించిరి. ఇవియే ఋక్కులు. ఋషులు
మంత్రద్రష్టలు. వా రున్నతాలోచనా ప్రపంచమున
తదేక నిష్ఠాజీవితములు గడపి, తమ జీవితములందు వానిని
సాక్షాత్కరించుకొని ప్రతిఫలింప జేసికొనిరి. శ్రుతులను
వెలుగొందజేసిన యీ పవిత్ర ఋషులకు పవిత్రగంగా
తీరమే యాశ్రయము. ఈ శ్రుతులయు, ఋషులయు,
గంగాదినదులయు పవిత్రతయే భారతీయుని జీవితాద
ర్శము. జీవితజ్యోతి. కాని ప్రాచీన ఋషుల జీవితచరిత్రలు-
లక్ష్యములే నేటికిని నిలిచియున్నవి గాని, గంగానది
మాత్రము తన భౌతిక శరీరముతో పవిత్ర వాహినిగ
ప్రవహించుచునే యున్నది. కోట్లకొలది భారతీయుల
కామె పవిత్రమాత. నేటికిని పెక్కురు భారతీయులు

తమ జీవితముల నీ పునీత గంగాతీరముననే గడప నుత్స హించుటయే గాక తమ దేహములను గూడ నీ నది యందే గలుప వాంఛింతురు.

గంగానది అద్వైత విజ్ఞానోత్పాదకము, పోషకమును. నివృత్తి దాయకము. గంగాతీరము శైవాలయములకాల వాలము. విశ్వేశ్వరాలయము, కాళికాలయము మున్న గున వీపవిత్రనదీతీరముననే యున్నవి. గంగ జ్ఞాన ప్రదా యిని గాన నిందు హృదయ వికాసమును, ప్రేమయు తక్కువ. ఈమెను దెచ్చుటకు భగీరథ ప్రయత్న మవసర మాయెను. గరళము కంఠమున దాల్చిన శివునంతటివాని శిరమున నీమె గాపుర మొనర్చెను. తాను గన్న బిడ్డలను సయితము హృదయమును రాయిచేసికొని తృణప్రాయ ముగ జంపుటకు జంక లేదు.

యమునయో! భ ప్రదాయకము. దీనికి హృదయ వికాసము పరిపూర్ణము. ఇది యితరుల ప్రయత్నము లేకయే ప్రజా కళ్యాణార్థము స్వయముగ నవతరించెను. యమున ప్రవృ ప్రధానము. వైష్ణవమత సాంప్రదా యకము. మధురా బృందావ నాది పుణ్యక్షేత్రము లీ పవిత్ర వాహినీ తీరమున గలవు.

అవతారములలో పూర్ణావతారమగు కృష్ణభగవాను డీ పవిత్రనదీతీరముననే యవతరించెను. ఇచటనే వివిధ

భక్తి మార్గములు : శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య, మధుర భావములు విలసిల్లెను. కృష్ణభగవానుని భక్తి లీలలు వేరుగ నుడువ నవసరము లేదు. మఱియు పశు పక్ష్యాది సర్వజీవులు భక్తియందే లీనమైనవి. కృష్ణుని మురళీగాన మాధుర్యమును గోపికలు, గోవులు, పక్షులు సర్వజీవులు చవిగొనెను. భక్తిరసమును గ్రోల్చి జీవులను తన్మయత్వ మొంద జేసిన దీ పవిత్ర వాహినీ తిలకమే. రాసక్రీడలలో, వ్రజలీలలలో గోవులు, యశోదానందులు, ఉద్ధవుడు మున్నగువారిభక్తిరసమును గ్రోలి తరించినవారే. యమునను స్మరియించినంతనే కృష్ణ భగవానుడు, గోపికలు, రాధాదేవి మున్నగువారు మనస్సున దగులుదురు. జీవితవికాసము నొసగి యానందసాగరమున నోలలాడించు భక్తిరసమున కిమెయే జనయిత్రి. భార్యాభర్తల మధుర భక్తిని బ్రదర్శించు తాజ్ మహ లీ పవిత్ర నదీతీరముననే వెలయుట సముచితముగనే యున్నది.

పవిత్ర గంగా యమునలు కొంతవఱకు భిన్న భిన్న మార్గముల బ్రవహించి తమ గమ్యస్థానమును, ఆత్మ రూపమును నగు సరస్వతితో ప్రయాగయందు లీనమగు చున్నవి. కేవల విజ్ఞానము రసరహితము. భక్తి యెడ తెగని మధుర రసప్రవాహము. భక్తిలేని జ్ఞానము హృదయ కాఠిన్యమును ప్రబలజేయును. జ్ఞానములేని

భక్తి యంధత్వమును ప్రేరేపించును. జ్ఞానము స్పష్టముగ చూచు వస్తువును భక్తి-విశ్వాసము దూరము నుండియే పసిపట్టును. చిత్రించుకొనును. విశ్వాసము భగవంతుని కొరకు సర్వదా పోరుసలుపును. జ్ఞానము తత్సిద్ధికై వేచి యుండును. జ్ఞానార్జనమున కైనను విశ్వాస మావశ్యకము.

భారతీయు లీపవిత్ర నదులను కేవల జలప్రవాహము లుగ గాక, అవాఙ్మానస గోచరములగు పలువిధ శక్తులను లీన మొనర్చుకొన్న ప్రభావ ప్రవాహములుగ భావింతురు. ఈ సత్యము నవీన ప్రకృతి శాస్త్రజ్ఞులకు గూడ విశ్వసించి ప్రశంసింపక తప్పదయ్యెను

"ఇప్పటికిని - మనము విస్పష్టముగ వివరింపజాల నప్పటికి-ఒక విచిత్ర సత్యమేమన గంగా యమునా జలములలో కలరా రోగక్రిములు రెండు మూడు గంటలలో మరణించును. ఈ నదులందు సర్వదా పెక్కు మురికి కాల్వలు కలియుచుండును. వేన వేల శవములను వీనిలో విడిచిపెట్టుదురు. కలరా మున్నగు వ్యాధిక్రిములు, శవములు క్రుళ్ళిదుర్గంధము వెలివఱచుచుండును గదా! ఈ నదులందు వేలకొలది జనులు స్నానమాడుదురు. వీని జలము స్వచ్ఛమైన దనియు, అపవిత్రత నొందజాలదనియు, నిర్భయముగ, నుల్లాసముగ నెల్లరు స్నాన

మాడి నీటిని గ్రోలవచ్చు ననియు తలచు భారతీయుల దృఢ విశ్వాసమును ప్రకృతి శాస్త్రమెంత దృఢముగ బ్రకటించుచున్నది! యమున నీటినికాచి వేడిచేసినచో నీ క్రిమి సంహారశక్తి నశించును. ఈ నదీప్రాంతపు బావుల నీటియందు కలరా క్రిములు బాగుగ విస్తరించును."

—డాక్టరు: యఫ్. సి. హారిసన్.

"కలరా, విరేచనములు మున్నగు వ్యాధులచే చచ్చి-గంగలో బడియున్న శవములను బరీక్షించితిని. కళేబరములకు కొలది యడుగుల దిగువ అనగా నీ వ్యాధుల క్రిములు విపరీతముగ నుండదగుచోట పరీక్షింపగా కలరా, విరేచన క్రిములే గాన్పింపలేదు. తరువాత నీ వ్యాధులు గలవారి నుండి క్రిములను తీసి గంగాజలమున వైచితిని. వెంటనే యా క్రిములన్నియు చచ్చెను."

—డాక్టర్. డె. హెరెల్ (ఫ్రెంచి ఫిజిషియన్.)

"కలకత్తానుండి యాంగ్లదేశమునకు ప్రయాణ మొనర్చు పొగయోడలు గంగాశాఖయగు హుగ్లీనదిలో మంచినీటిని నిలువచేసికొనిపోవును. కాని యింగ్లండునుండి కలకత్తాకు వచ్చు పొగయోడలు ఇంగ్లాండులో గైకొను జలము బొంబాయివచ్చువరకైన నుండక చెడిపోవును. లండను నుండి కలకత్తా కింకను వారము దినముల ప్రయాణ ముండగనే వీరు ఎఱ్ఱసముద్ర తీరమందలి పోర్టుసెడ్ లేక

సూయజ్ కాలువలోనో, ఏడెను తీరములోనో తిరిగి క్రొత్తనీటిని గైకొందురు."

—డాక్టర్. సి. యి. నెల్సన్ F. R. C. S. (బ్రిటిషు ఫిజిషియన్.)

తఱచు భారతీయ సంప్రదాయమును గౌరవింపని పాశ్చాత్త్యుల మాట లివి. అట్టిచో భారతీయు లీ నదీ ప్రవాహములను శక్తిమంతములుగ-పవిత్రవంతములుగ భావించుటలో నాశ్చర్యమేమున్నది? శాస్త్రజ్ఞులు పై జెప్పిన విచిత్ర సంఘటనల బేర్కొ-నవచ్చునుగాని శాస్త్రమున కతీతములగు శక్తు లీ జలముల యందు గలవు.

వాని స్థూల శక్తులను బ్రకటించు శాస్త్రకారుని విజ్ఞానమునకు మన మాశ్చర్యమును బ్రకటింపవచ్చును గాని యా శక్తుల మహిమను - ఆంతర్యమును స్పష్ట పరుప నెవరితరము? కావున భారతీయులకు గంగా యమునలు కేవలము నదీ ప్రవాహములుగావు; పవిత్ర జలదేవతలు. వీని నంటినంతనే మనుజుడు పునీతుడగునని వారి విశ్వాసము. భారతీయు లెచ్చట స్నాన మొనర్చు చున్నను వీని పవిత్రనామములు జపింపక యందు మునుకవేయడు. మరియు నీ పవిత్రనదుల జలములు పాత్రల నింపికొని వచ్చి తమ పానీయ జలములందు కొంచెము కలిపికొని పవిత్ర భావమున పుచ్చుకొనును.

# భారతదేశ సందేశము

భావిభారతస్థితినిగూర్చి నేడు పెక్కురు తీవ్రాలోచనములు గావించుచున్నారు. కొందఱిదివరకే తమ భావములను స్పష్టముగ బ్రకటించినారు. భారతీయ జీవిత మార్గమునుగూర్చి తీవ్రాలోచనములు, విమర్శనములు జరుగుచున్నట శుభసూచకము. వీనిని గూర్చి కొంత విపులముగ చర్చింతము.

భారతీయు లభివృద్ధిని గాంచవలెనన్న సంఘజీవితమును ఆర్థికాధారములపై నిర్మింపవలెననియు, ఎల్లరికి సమానార్థిక సాంఘికక జీవిత విధానముండవలెననియు కొందరు భావించుచున్నారు. వీరిదృష్టి యిది. 'భారతీయులసమస్యయాహార సమస్యయే. కడుపునిండ తిండి, ఒంటినిండబట్టయున్నచో భారతీయులు సుఖింపగలరు. మతము, ఆధ్యాత్మిక దృక్పథములు మన సాంఘికాభివృద్ధి కాటంకదాయకములు, హానికరములుకావునవీనినివిసర్జింపవలెను.'

'ప్రాచీనత చెక్కు చెదరక, యే మాత్రమును మార్పు నొందకుండుటయే భారతీయ ధర్మ'మని కొందరు సనాతనులు భావించుచున్నారు. వీరి దృష్టిలో ప్రాచీనాచారములు, ప్రాచీన పద్ధతులు కరుడుగట్టి సంఘమును

గట్టిగ నంటిపెట్టుకొని యుండవలెను. ఏ స్వల్ప పరిణామ మయినను భారతీయత్వమును జెఱచునట.

కొలది మంది మాత్రము 'పరదేశీయుల యాగమన ఫలితముగ వారి సంబంధమువలన నేర్పడిన ఆయా నాగరికతల సమ్మేళనమునుండియే భావి భారత ముద్ధరింపబడు' నని వాదింతురు.

'ప్రాచీనాదర్శములు, సిద్ధాంతములు సుస్థిరములగు పునాదులుగా జేసి నవీనానుభవ ఫలితములతో పునరుద్ధరింపబడిన భారతమును నిర్మింపవలెను. కాన గ్రామములకు మరలుడు. ప్రకృతి కభిముఖులుగండు. ప్రాచీన వైదిక సూత్రముల యుత్కృష్టతా దిశకు దిరుగుడు. ఈ సుదృఢములు, శాశ్వతములు నగు పునాదులపై మన భావి భారత సౌధమును నిర్మింపుడు. ఆధ్యాత్మిక జీవిత పథము నందే భారత సాంఘిక, ఆర్థిక, నైతికాభివృద్ధి గలదు. మన సంఘ సౌష్ఠవము, పూర్ణత ఆత్మబలముపై నిర్మింపవలెనేగాని క్షణికములగు పూతమెరుగుల భౌతిక సంపదలపై, పశుబలమున కూడిగ మొనర్చు నాగరికతపై నిర్మింపజనదు. ఇది మన సహజ వికాసమునకు విరుద్ధము' అని ప్రాక్పశ్చిమ విధానములు సమగ్రముగ విమర్శించిన పెద్దలు, నాయకులు, మహాత్ములు నుడువుచున్నారు. పై వారల భావములు, దృక్పథము లెట్లున్నను ఎల్లరు

దేశహిత బుద్ధితో - సంస్కృతి ప్రేమతో ఉద్దీప్త మగు భారతమును వాంఛించుట శుభచిహ్నము. కాని మన ప్రాచీనత నంతటిని తుడిచిపెట్టి, కేవల పాశ్చాత్య నాగరికతపై భావి భారతమును నిర్మింపవలె నను భావములు మాత్రము వాంఛనీయములుగావు. ఇట్టి వారు నిరంతరము భారతీయ నాగరికతా సంస్కృతుల గర్హించుచు, పాశ్చాత్యుల నెల్ల విషయముల ననుకరించుచు దానినే నాగరికత, అభివృద్ధి, సంస్కృతి యని విపరీతముగ ప్రచార మొనరించుచున్నారు.

“తమ తమ మానసిక విశ్వాసములపై భావి సంతతికి నూతనవిధానములనునిర్మింప నుద్యుక్తులూగువారుతరచుగ విషమిళిత నియంతృత్వమునకు గురియగుచున్నారు. క్రొత్తవని తాము సగర్వముగ నుద్ఘాటించు పెక్కు భావములు ౫000 వత్సరములనాటివే యను విషయమును వారు మఱచుచున్నారు. సింధు నదీ లోయలో ౫000 వత్సరముల క్రితము నిర్మింపబడి, భూగర్భగతములయిన పట్టణములు మురుగుపోవు చక్కని మార్గములతో క్రమ నిర్మాణము గలిగియున్నవి. ప్రతి పెద్ద గృహమున నొక స్నానపు గది యున్నది. ప్రాచీన వైదిక విజ్ఞానముచూపు వేదికలు ప్రాజ్ఞతను, సామాన్య విజ్ఞానమును బ్రదర్శించుచు, భవన నిర్మాణ వైభవమునందును, పౌర పాలనము

నందును ప్రాచీన భారతీయుల ప్రతిభను ప్రదర్శించుచున్నావి. నేటి సమస్యలు పరిష్కరించునప్పుడు ౫౦౦౦ సంవత్సరముల పూర్వపు సింధు నదీ ప్రాంత పౌర నాగరికత గాంచినచో దానికి నమ్రులముగాక తప్పదు. యూరపులో నేడు నురఫిరంగులకు గురియై పాడైన మనపట్టణములకు పునర్నిర్మాణము గావించుటలో భారతీయుల కృషియు, నేర్పును, విజ్ఞానమును మనము గ్రహింపనగును."

—బి. యస్. టౌన్ రో, బ్రిటిషు గృహనిర్మాణ
కేంద్రసంఘ సభ్యులు.

భారతదేశము సర్వదా ఆధ్యాత్మిక ప్రజ్ఞనే తన జీవిత సత్యముగ ప్రకటించి ప్రబలజేసెను. ఇంతియగాక యది యమృత సత్యములతో - ఆధ్యాత్మికానుభవములతో నిర్మాణ మొనర్చిన సంస్కృతిని, జీవిత సౌష్ఠవమును, సర్వాంగ సౌందర్యమును జేకూర్చు నాగరికతను నిర్మించెను. కావున భావి నాగరికత యెట్లుండవలెనని తలంచునపుడు ప్రధానాత్మసత్యమును త్రోసిపుచ్చ వీలు లేదు. ఇందే భారత జీవశక్తి సదా ప్రవహించి, ప్రపంచమును వికాసవంత మొనర్చి ప్రఖ్యాతి గాంచినది. ప్రాచీనాధ్యాత్మిక తపస్సు నుండియే భావి భారత పరిణామమును, వికాస శక్తిని విస్పష్టముగ - కళాశోభతో మూర్తీభవింప జేయవలెను.

తమ నాగరికత మానవ మానసికౌన్నత్యమును గలిగించుచున్నదని పాశ్చాత్యులు తరచు ప్రకటించుచుందురు. అయినను నేటి తమ భౌతిక నాగరికత, పశుబల ప్రదర్శనములే తమ సర్వస్వమును వినాశ మొనర్చుట గాంచి వారు విస్మయము జెందుచున్నారు.

పాశ్చాత్యులు శాస్త్రముల నభివృద్ధి దెచ్చిరి. యంత్రములు నిర్మించి వ్యాపారము పెంచిరి. సామ్రాజ్యములు స్థాపించిరి. ప్రపంచమంతటను వ్యాపించి ప్రబలిరి. ఐనను ఆయుధాగారములు, సైనిక నిర్మాణములు, సామ్రాజ్య స్థాపనములతో నర్థసంపాదనమునకు గడంగు నేటి పాశ్చాత్య సభ్యత్వము జాతీయ దురహంకారముతో తాండవ మాడుచున్నది. కాని యిందు శాంతి ప్రేమలకు తావులేదు. దుర్బల జాతులకు స్థానములేదు. ధర్మ దూరమైన విజ్ఞానము, హద్దుమీరిన భోగలాలస, ఈర్ష్యా స్పర్థల కాలవాలమగు నర్థ సంపాదనము, దుర్బల జాతులను దాస్య పాశములచే బంధించు రాజ్యాంగము, ఆత్మ వినాశము జేకూర్చు దురహంకారము, ప్రజాపీడన మొనర్చు శాసనాధికారము, పర ధనాపహరణ మొనర్చు వ్యాపార సరళి, పెక్కుర వినాశముతో కొలది మందికి భోగములు చేకూర్చు జీవిత పథము, పాశ్చాత్య సభ్యతను భగ భగ

మండుచున్న యగ్ని పర్వతముపై వాస మొనర్పజేసి ప్రళయమునకు రాచబాటలు నిర్మించెను.

'నేనే భగవంతుడను నేనే సర్వము'నను దురహంకారముతో పాశ్చాత్యుడు పంచభూతములను బంధించినాడు. సర్వజాతుల నణంచినాడు. శాస్త్రకారులు మారణ యంత్రములను, మరఫిరంగులను నిర్మించి ప్రజాపీడనమునకు, నాశనమునకు దోడ్పడుచున్నారు. విపుల ధనార్జనమునకు, వ్యాపార విస్తారతకు సామ్రాజ్య విస్తృతిని తోడుచేయుచున్నారు. రాజ్య తంత్రజ్ఞులు నూతన సామ్రాజ్యములకు వలలు పన్నుచున్నారు.

పాశ్చాత్యనాగరికత విజృంభించి గొప్ప శక్తిని ప్రపంచముపై ప్రసరింపజేసినది. ధనార్జనమునకు విపుల సాధనములను విస్తరింపజేసినది. అది కొంత వికాసమును, అభివృద్ధిని గాంచినమాట వాస్తవమే. కాని నీతిని దూర మొనర్చి, ధర్మమును మఱుగుపఱచి, భౌతిక భోగ తృష్ణను, తత్సాధన సామగ్రిని పెంపొందించుటచేతనే తాను విజృంభింపజేసిన శక్తియే ఆసురిక శక్తిగ మారి భస్మాసుర వరమువలె తన యునికికే మోసము దెచ్చుచున్నది. తానార్జించిన ధనమే విపుల దారిద్ర్యమునకు దారి దీసినది. తాను సృష్టించిన దావాగ్నియే తన వారిని దగ్ధమొనర్చుచున్నది. ప్రపంచమున భీకర యుద్ధముల

ప్రబలజేసి, ఆత్మనాశమును, పరులవినాశము నొనర్చుచు వికటాట్టహాసములు గావించుచున్నది. అది దైవమును కాలదన్ని సైతానును తలదాల్చుచున్నది. ఈ సందు చూచుకొని క్రైస్తవమత ప్రచారకులు మాత్రము సప్తసముద్రములుదాటి సకల ప్రపంచమున విస్తరించిరి. ఎడారులనక, అరణ్యములనక, పర్వతములనక సర్వ ప్రాంతముల బ్రవేశించిరి. సమస్త జాతులందును బ్రవేశించి ప్రార్థనామందిరములు నెలకొల్పిరి. విద్యాలయములు స్థాపించిరి. వైద్యాలయములు నిర్మించిరి. శరణాలయము లేర్పరచిరి. భీకర సంగ్రామముల మధ్య - మర ఫిరంగులమధ్య - రెడ్ క్రాసు సంఘ చిహ్నములతో క్షత గాత్రుల సేవలు గావించుచున్నారు. ఇన్నియును క్రీస్తు బోధలగు ప్రేమ సహనభావములను మారు మూలకునెట్టి పశుబలము నుపాసించుచు గావించుటచే, ఆసభ్యత తన ధర్మశక్తి యణగారి పశుబల ప్రేరితమగు ప్రభుశక్తికి లొంగిపోయినది. శాస్త్ర విస్తరణమున క్రైస్తవ ధర్మము గానరాదు. యంత్రనిర్మాణములందు దీని కాస్పదము లేదు. సామ్రాజ్య సభలలో, విపణివీధులలో, శస్త్రాగారములలో దీనికితావులేదు. విజ్ఞాన దుర్వినియోగము, దురాశ, స్పర్ధ, అశాంతి విచ్చలవిడిగ తాండవమాడు చున్నవి. ఇట్లు యూరపు ఖండ మగ్ని పర్వతమువలె

బద్ధులై లోకమును దగ్ధ మొనర్చుచున్నది. కాని భారతీయుని యాదర్శము పరబ్రహ్మము. ఆత్మ వానికిలక్ష్యము. దృక్పథము దైవము. ఆత్మ సత్యములే వాని యాశయములు.

"మర్త్యులలో నమరత్వముగలదియు, సత్యము నావిర్భవించునదియు దైవమే. ఇదియే మన యంతరంగమున నాత్మశక్తిగా దైవశక్తులను విజృంభింపజేసినది.

"ఓ మహాశక్తీ ! నీవు విజృంభించిసర్వావరణములను జించివైవుము. దైవము వైపునకు దారిదీయు సర్వశక్తులను మాలో మూర్తీభవింపజేయుము." —ఋగ్వేదము.

అనంత సత్యముకొఱకు కృషి గావించి యద్దాని నుద్దీపింపజేయుటయే భారతీయ నాగరికత, సంస్కృతుల పరమావధి. ఇదియే భారతీయుని స్వధర్మము. ఆధ్యాత్మిక స్వాతంత్ర్యమే వాని యున్నత లక్ష్యము. దీని నలవరచుకొనుట కేర్పడిన క్షేత్రము జీవితము. తన జీవశక్తిని విజృంభింపజేసికొని, యాంతరంగిక వికాసమును జేకూర్చికొని, దానిని సంఘమున సర్వవిషయములందు విస్తరించి వికసింపజేయుటయే భారతనాగరికత. ఇది మానవుని కతీతమగు వివిధదైవశక్తులను గాంచెను. ఆ వివిధముల వెనుక బ్రహ్మమును (పరమాత్మను) కనుగొనెను. బ్రహ్మములోనే తనయస్తిత్వమును,సనాతనత్వమును బ్రకటించెను.

మానవ జీవితమునకు మిన్నయైన జీవిత దృక్పథములు చూచెను. ఈ లోకమునుగాక పెక్కులోకములనుగూడ దర్శించెను. మన భౌతిక మనస్సునకు మించిన మానసికావస్థల ననుభవించెను. వాని యన్నిటికిని మిన్నయై జ్యోతివలె ప్రకాశించు నాత్మను గాంచెను. తన విజ్ఞానమును వికసింపజేసి, మనస్సును స్వాధీనమొనర్చుకొన్నచో వానినెల్ల మానవుడు జయింపగలడని ధైర్యముగ ప్రకటించెను. ఈ మానసిక దృక్పథములనెల్ల జయించి తానే భగవంతుడు కాగలడనియు, తానే ఆత్మయనియు నెలుగెత్తి చాటెను. ఇదియే భారతీయ జీవిత ద్వారము దెఱచు తాళపుచెవి. ప్రాచీనకాలము నుండియు దీని యాధ్యాత్మిక శక్తులే వివిధ రూపములుగ ప్రవహించి, జీవనదులను సృష్టించి లోకకళ్యాణమును జేకూర్చెను. ఉన్నతపదముల నుండి సత్యబీజములను గొనివచ్చి ఫలవంతమగు నీ భూమియందు నాటి రుచ్యఫలముల నొసగెను. ఈ సత్యబీజములే దీని శాస్త్రములయందు, కళలయందు, రాజకీయములందు, ఆధ్యాత్మిక తత్త్వశాస్త్రములందు, సారస్వతమునందు, మతమునందు అంకురించి, క్రమాభివృద్ధినంది, పుష్పించి వికసించెను. ఈ యాత్మానుభవము పవిత్రమగు దీని భావి నింకను పవిత్రవంతముగ – ఇంకను వికాసవంతముగ – ఇంకను విశాల కీర్తిమంతముగ గావింపగలదనియే

మా దృఢ విశ్వాసము. ఇదియే భారత చరిత్ర చాటిన సారాంశము.

కాని పాశ్చాత్య విద్యావ్యామోహితులు, పాశ్చాత్య సాంప్రదాయముల ననుకరించు వారు, పాశ్చాత్య సభ్యత నలవఱచుకొన్న కొలదిమంది భారతీయులును పాశ్చాత్యు లకన్న గట్టిగ 'ప్రాచీన భారత దేశము వినాశ మొందినది. దాని జీవిత జ్యోతిని ప్రకాశింప జేసిన తైలము పూర్తి యైనది. ఇక నది జీవించుటకే శక్తి లేదు. గతమంతయు గర్హింపదగినదే. కావున నవీనత నలవఱచుకొన్న నవీను లుగ మాత్రమే మన ముండవలెను.' అని నుడువు చున్నారు. భారతీయుల ప్రాచీన జీవితరహస్యములకన్న - ఆధ్యాత్మిక శక్తులకన్న - పాశ్చాత్యుల భావములు, ఆచారములు, సంప్రదాయములు వీరికి మిన్నలు. అలవఱచుకొన సుసాధ్యములు. వీరిది యంత్రయుగము. యంత్ర వేగముతో వీరి మనసులు పరుగిడును. యంత్ర వేగముతో వీరు ప్రయాణములు గావింతురు. 'మన మన స్సులో! మందగమనములు. మన ప్రయాణములు ఒంటెద్దు బండి ప్రయాణములు. మన నాగరికత కుటీర నాగరికత' అని మన సర్వము నీసడించుటయే వీరి నవీనతా లక్ష్యము. కావున 'భారత దేశ మభివృద్ధి గాంచవలెనన్న పాశ్చా త్యుల మార్గముల నలవరచుకొని వారి ననుకరింపవలెను.

వారి ననుకరించుట వలననే మన నాగరికత వికసించును' అనుచు తమ్ము నీచపరచుకొనుచు పరులను ప్రశంసించుచుండుటయే వారి దినచర్య.

పాశ్చాత్యులే మన నాగరితకను, సంస్కృతిని, వేద విజ్ఞానమును ప్రశంసించి, వీనిని తమ జీవితములందు జీర్ణింపజేసికొనుచున్న యీ కాలమున భారతీయులలో గొందరిట్లు గ్రుడ్డిగ పాశ్చాత్యుల డాంబిక జీవితముల ప్రశంసించుచు, నలవరచుకొనుచుండుట విచారకరము, గర్హ్యము. కాని పాశ్చాత్యులవలె వీరభివృద్ధియందొక్క యడుగైనను వైచుచున్నారా ? యని మాసంశయము. మొన్న పాశ్చాత్యులు వర్జించినవానిని నేడు వీరు స్వీకరింతురు. పాశ్చాత్యులు ధరించి మాసినవని, చిరిగినవని త్రోసివైచిన దుస్తులు వీరు నూతన వస్త్రములని పరిగ్రహింతురు. ఒకప్పుడు పాశ్చాత్యులు మంచివనిభావించి, అనుభవముచే పనికిమాలినవని త్రోసివైచిన భావములు-జీవిత లక్ష్యములు వీరు వరప్రసాదములుగ స్వీకరించి వాని నలవరచుకొన బ్రయత్నింతురు.

భారతీ యాదర్శములు శాశ్వతములు. అవి ప్రాచీన సచ్ఛంద విజ్ఞాన ప్రవాహ జలమును గ్రోలి యమృతత్వమును బడసెను. భారత నాగరికత యనాది గావున నాశనము నెఱుగదు. ఆ యాదర్శములు తమ సహజ దృఢ

శక్తిచే పరుల క్రూరములగు దాడులను, బెక్కు గండము లను గడవగలిగెను. ప్రాచీనములగు గ్రీకు, రోము, ఈజిప్టు దేశములు నామరూపములు లేక నశించినను భారతీయులు మాత్రము నేటికిని విపుల విజ్ఞాన కాంతుల బ్రసరింపజేయుచు నాత్మ శక్తిని బ్రకటింపజేయుచునే యున్నారు. భారతము ప్రాచీన సంప్రదాయానుసారముగ తన సంస్కృతిని జూపుచునే యున్నది. గ్రీకులు, పార్థియనులు, హూణులు, ముసల్మానులు, ఆంగ్లేయులు తమ వికార చేష్టలతో, క్రూరములగు దాడులతో నిందు విచ్చలవిడిగ తాండవించినను వారి చేష్టలు తాత్కాలిక ములై నశించినవేగాని దీనిని నాశ మొనర్పజాలక పోయెను.

ఇందు వైదిక ఋషులు సాధించిన యాత్మ విజ్ఞానము నేటికిని వికసించుచునే యున్నది. ఈనేలపై గావింపబడిన ప్రతి దండయాత్రను ఆవిజ్ఞానము పౌత్రపూర్వకముగనో, ఆధ్యాత్మికము (సత్యాగ్రహము) గనో యెదుర్కొని తాను నిలిచి జీవింపగలిగెను. ఇది యాధ్యాత్మిక నిర్మాణశక్తి సంఘటనా - ప్రతిక్రియ శక్తులచే నిట్టెదుర్కొని ఔన్నత్యము బడయగలిగెను. తన యాధ్యాత్మిక శక్తిచే జీర్ణించుకొనదగినదానిని జీర్ణించుకొని, విసర్జనీయమగు దానినెల్ల విసర్జించి, తుష్టిని, పుష్టిని జేకూర్చుకొని యభివృద్ధి గాంచగలిగెను. ఇట్లు జీవశక్తిని విజృంభింపజేసి, ప్రచండ

సామ్రాజ్యవాదులను ప్రసన్నులుగ గావించికొని ప్రజలకు కళ్యాణమును జేకూర్చెను. పరిష్కరింపరాని సమస్యల వారిని తనలో లీనమొనర్చుకొని యున్నతస్థితికి దెచ్చెను. నేటికి నిల్చే యీ దేశము మనకన్నుల యెదుట గావించు చున్నది.

భారతమాత తన నాకరికతా శక్తి ప్రభావముచే, ఆత్మ విజ్ఞాన తేజః పుంజములచే బాహ్య సైకతముల పైగాదు; ఆంతరంగికములగు సుస్థిరాధారములపై సుందర సౌధ నిర్మాణము గావించెను. "ఏకం స ద్విప్రా బహుధా వదంతి" యను ఆత్మ సత్యత నీ నశ్వర ప్రపంచమునకు ప్రకటించి మానవ సౌభ్రాతృత్వమును బయల్పఱచెను.

'భారతదేశము ప్రాచీనకాలమున తన సందేశము నొసగినది. ప్రస్తుతము భారతీయ సంస్కృతి యొసగగలిగిన దేమియు లేదు. దాని పునర్నిర్మాణము నూతన పద్ధతులపై గావింపవలసినదే'యని పలుకుట భారతీయ యథార్థ చరిత్రను మభ్యపఱచుటో లేక పెడదారుల నడచుటో యని నుడువదగినదే. భారతీయ సంస్కృతి కేంద్రమును, చరిత్ర పరిణామమును గమనింపనివారి మాట లివి.

ఆధ్యాత్మిక శక్తివికాసము, ఉత్తేజవంతమగు జీవశక్తి బాహుళ్యమేగాక జీవాత్మను పరమాత్మ సన్నిధికి జేర్చు ఉన్నతాచరణమే దీని సంస్కృతి సారము.

'మనయందలి సత్తే సత్యమనియు, జీవ క్రమ క్రమా భివృద్ధియే మన జీవిత వికాసమనియు, జీవాత్మయే ప్రకృతి యందలి దైవమనియు, భగవంతుడే ఉత్తముడనియు నిది గుర్తించును. క్రమాభివృద్ధియు, ఆత్మోద్దీపనమును భారతీయుని జీవిత వికాసము. మానవ జీవిత లక్ష్యము."

దీని తత్త్వ వేదాంత నాగరికతల ప్రధాన లక్ష్యము మానవుని దేవత్వమునకు జేర్చుటయే. వైదిక కాలమున భారతీయుని భౌతిక మనోదృక్పథము సహజముగ ఆత్మ వంకకు ప్రేరేపింపబడెను. కాని కొంత కాలమునకు ఉన్నతాధ్యాత్మిక సత్యమార్గములు బాహ్యమత పూజ లతో ముగిసిపోయెను.

పౌరాణిక, తాంత్రిక యుగములందు మతము మాన వుని భౌతిక మానసిక తత్త్వములపై తన బాహ్యాచార ములను ప్రకటించి దైవత్వమును బ్రదర్శించెను. బాహ్యాం తరములందు ఉన్నత తేజఃపుంజములను ప్రభవిల్లజేసెను. బ్రహ్మతేజము ప్రజ్వరిల్లి ఆధ్యాత్మిక వికాసము విస్తరిం చెను. నవీన భారత దేశముగూడ తన సహజధర్మమగు నాధ్యాత్మికశక్తిని పాశ్చాత్య దేశముల మీదను, ప్రపం చమునందంతటను ప్రసరింపజేయుచునే యున్నది. ఈ దేశ మింకను జీవించియే యున్నది. జీవించి మానవాభివృద్ధికి

తన సందేశము నొసగవలసి యున్నది. ప్రాచీన భారత వర్షము మతము, ఆధ్యాత్మికములందు ప్రఖ్యాతిని గాంచి నను రాజకీయ ఆర్థిక విధానములు త్రోసివైచి, తాను పతనము నొందెనని కొందరు నేడు నుడువుచున్నారు. కాని యిందు సత్యము లేదు. భారతీయ పతన కారణములు వేరుగనున్నవి. భారతదేశము ఋషులను, అవతారపురుషులను, మత స్థాపకులను, స్మృతికర్తలను, ఆచార్యులను, కవులను, శాస్త్రవేత్తలను, కళాకోవిదులను, గాననిపుణులను శారీరిక, మానసిక, నైతిక పటుత్వముగల మానవోత్తములను గనియుండెను. రాజాధి రాజులను, మంత్రులను, అర్థశాస్త్ర నిపుణులను గాంచి సుసిరములగు పునాదులతో ప్రజాకల్యాణమును జేకూర్చుచు మోక్షదాయక మార్గముల నలవరచుకొనెను. భారతీయులు వీరులై యుద్ధములు గావించిరి. ప్రజారంజకముగ పాలించిరి. ప్రపంచమున మూల మూలలతోడను న్యాయ ప్రవర్తనముతో, నీతితో వర్తక వ్యాపారములు గావించిరి. సంఘ నిర్మాణము నొనర్చిరి. ప్రజాభివృద్ధికి దోడ్పడు సర్వ విషయములందును విశాల విజ్ఞానమును, ఉన్నతాభివృద్ధిని బడసిరి.

పాశ్చాత్య దేశములతోడి భారతీయుల సంబంధము ఉభయులకును కొంత లాభము జేకూర్పక పోలేదు. భార

తీయులు పాశ్చాత్య శాస్త్రదృష్టితో తమ సత్యములను, ఉన్నత సిద్ధాంతములను విస్పష్టముగ ప్రకటించి, పాశ్చాత్త్యులపై బ్రసరింపజేయుటయేగాక తమ ప్రజలయందును చైతన్యమును బెంపొందించుకొనిరి. కాని భారతదేశము కేవలము గ్రుడ్డిగ పాశ్చాత్త్యుల ననుకరింప నిచ్ఛగింపదు. కొలది మందికి మాత్ర మీకోర్కె ప్రబలముగ నున్నను నది దీని సహజధర్మమునకు విరుద్ధముగాన నది వ్యర్థము గాక తప్పదు. అంధానుకరణము బానిసతనమును బ్రకటించును. అది యా యనుకర్తల దుర్బలత్వమును, మానసిక దారిద్ర్యమును మాత్రమే ప్రదర్శించును. ఏ దేశమునందును లేని రహస్య శక్తిని ప్రకోపింపజేయుటయే భారతమాత వాంఛించునది. అట్టి జీవశక్తి విస్ఫురణమును తిరిగి యామె విజృంభింపజేయుచుండుట శుభ సూచకము. ఆమె ప్రపంచమునకు శాంతిని, దాంతిని నొసగి తీరును.

రాజకీయోద్యమ విజృంభణము ఆధ్యాత్మిక శక్తి వికాసముతో లీనముగాక తప్పదు. భారతాత్మ నేటికిని విస్పష్టముగ బ్రకాశించుచునే యున్నది. పండితులు దీనిని గాంచుచునే యున్నారు. విజ్ఞాన కోవిదు లిద్దానిని స్పష్టముగ వివరించుచునే యున్నారు. దయానందసరస్వతి, రామకృష్ణ పరమహంస, వివేకానంద, రామతీర్థ, అర

విందఘోషు, మహాత్మా గాంధి మున్నగు ఆత్మోద్దీపకులీ సత్యమును బ్రపంచమునకు బ్రకటించియే యుండిరి.

ఇందు రామకృష్ణుని మహిమ ప్రత్యేక విలక్షణత్వ మును, సహజ సౌభాగ్య తేజఃపుంజమును ప్రకాశింపజేసి నది. అక్షరజ్ఞాన శూన్యుడగు నీ యవతారమూర్తి పాదారవిందములకడ నాంగ్లేయ విద్యాధురంధరులు వినమ్రులై, దోసిలియొగ్గి భక్తులైరి. వివేకానందుని ప్రాక్పశ్చిమ సంచార ప్రచారములు భారతదేశ యథార్థ తత్త్వమును బ్రకటించుటయేగాక ప్రపంచమును భారత భావముచే జయించెనని నుడువుటయందతిశయోక్తిగాని, యసత్యముగాని లేదు. వివేకానందుని శక్తిప్రభావము నేటికిని వికసించి నృత్య మొనర్చుచునే యున్నది. భారతమాత యాత్మయందు - భారతీయాత్మ యందు నేటికిని వివేకానందుడు జీవించియే యున్నాడు. అరవిందుడు 'వందేమాతరం' మంత్రప్రబోధముతో రాజకీయ కదనరంగమున దుమికియు, నిప్పుడాధ్యాత్మిక - ఆంతరంగిక వికాసానంద సాగరమున నోలలాడుచున్నాడు. ఓ భారతీయ సోదరులారా ! మీ గతమును విస్పష్టముగ గ్రహించి భావి యౌన్నత్యమునకు వినియోగింపుడు. ప్రథమమున భారతీయులుగనుండి మీ పైతృక సంపత్తిని గ్రహింపుడు. ఆర్యాలోచనములను, క్రమశిక్షణమును, ధర్మ ప్రవర్త

నమును, సంస్కృత జీవితమును పునరుద్ధరింపుడు. అదియే భారతీ యాధ్యాత్మిక సాధనము, వికాసము. తపోజ్ఞాన శక్తులే మనలను స్వతంత్రులుగను, గొప్ప వారుగను గావించును. ఇవియే భారతీయులకు తారకము. భారతీయులకే యననేల ? మానవకోటికే యివి తారకము. అదియే భగవదుద్దేశము. భగవంతుడే మనలను గమ్యస్థానమునకు జేర్చును. తన సహజప్రకృతి ననుసరించి, తన్ను తాను తెలిసికొన్ననాడే భారతదేశము అభివృద్ధియయి మానవాభివృద్ధిని గావింపగలదు.

ఈ కార్యక్రమమును సమగ్రముగ నెఱవేర్చుటకు అరవిందుడు మూడు ప్రధానవిషయములను తెలిపెను. (అ) ఆర్యత్వము: ప్రాచీనాధ్యాత్మిక శక్తిని సర్వతోముఖముగ, సమగ్రముగ వికసింపజేసి పునరుద్ఘాటించుట. (ఆ) ఈ శక్తిప్రభావమును వేదాంత శాస్త్రమునందు, ప్రకృతి శాస్త్రములయందు కళలయందు, సాహిత్యమునందు స్వతంత్రముగ- నిరంతరముగ ప్రవహింపజేయుట. (ఇ) స్వతంత్రశక్తితో, నవీన విజ్ఞానప్రభతో ప్రాచీనాధ్యాత్మిక జ్యోతి నుద్దీపింపజేసి, ప్రాక్పశ్చిమ జ్ఞానవిజ్ఞాన సమ్మేళనమును, మానవ కళ్యాణమును జేకూర్చుట. అయినచో, భారతీయాంతరంగిక న్యాయమును, స్వధర్మమును గనుగొని ప్రకటించుటెట్లు ?

తర్కమును, హేతువాదమును, ప్రాకృతిక, వస్తు విష యికమగు విజ్ఞానమునే ప్రకటించును. కాని భారతీయ స్వధర్మమో! నైతిక రహస్యమును, దాని జన్మస్థానమును దెలిపి యాచరణమునందుంచును. వస్తువిజ్ఞానమును ఆత్మోద్దీపనమును, అనుభూతిని బడయవలయును. ఈ విధానము మాత్రమే దేదీప్యమానముగ ప్రకాశించు భారతీయాత్మను బ్రకటింపగలదు. కేవలము మనస్సుచే, విజ్ఞానముచే బడయజాలని యాత్మానుభూతిని నవీనులు, పాశ్చాత్య నాగరికతా సంపన్నులు నగువారు శాస్త్ర దృష్టితో బడయవాంఛింతురు. ఆధ్యాత్మిక జ్ఞానమును కేవల మానసిక వికాస చిహ్నమగు శాస్త్రజ్ఞానముచే బడయజాలము. భారతీయ సంస్కృత జీవిత పథమునకు మూలాధారములను గాంచుట కే పాశ్చాత్య విధానమును తోడ్పడజాలదు.

కాని భారతీయులు తమ ప్రాచీనతకే యంటిపట్టుకొని కాలానుగుణములగు మార్పుల నిచ్ఛగింపకుండుటతగదు. ప్రాచీన పవిత్ర సత్యములు భావ్యభివృద్ధికి సాధనసంపత్తిగ నుండవలెను ప్రాచీనకాలమునుండియు భారతీయులు ఆత్మ వికాసమునకు, ధర్మమునకు ప్రాధాన్యము నొసగిరి. శారీరిక, మానసిక, జీవితాభివృద్ధిని గోరు తత్వమునే వాంఛించిరి. పూర్వపు ఆత్మీయమగు పునాదిపై నెలకొల్ప

బడిన నేటి మనచరిత్రయే భావిని సత్ఫలితముల నొసగును. నూతన వికాసముగల మన ప్రతి ప్రయత్నము ఉత్తమాభివృద్ధికి తోడ్పడును.

ఆత్మపథము భారతీయ జీవిత విలక్షణ లక్ష్యము. భారతీయ సర్వప్రయత్నము అధ్యాత్మికోన్నతికే సోపానమయినది. సర్వము నా వైపునకే పయనించినది. భారతీయ మనః ప్రవృత్తి యాత్మసత్యత్వమును, దాని పూర్ణతను కనుగొనుటకు దారితీయవలయును. కాని నేటివారు దీనిని బాగుగ జీర్ణించుకొనజాలక పోవుటయే మనపతన హేతువు. కావున భారతీయ సంఘ లక్ష్యములు సర్వతోముఖమగు నాత్మాభివృద్ధి దాయకములుగ నుండవలెను. ఇదియే ప్రపంచ సమస్య. కేవల ప్రాపంచిక భావమునబడి కొట్టుకొనుట వలననే వీరికి పతనస్థితి యేర్పడెను. మాయావాదము సత్యమును గప్పిపుచ్చి, బాహ్య వేషములకు తావొసగినప్పుడే పాశ్చాత్య ప్రభుత్వమిందు కాలిడ గలిగెను. తాత్కాలికములగు తళుకు బెళుకులుగల పాశ్చాత్య నాగరికత యందలి మోహముచే నాయథార్థ స్వరూపము మరుగు పడెను.

భౌతిక వాంఛల నీడేర్చు వ్యక్తిగతమగు పాశ్చాత్య భౌతిక నాగరికత ప్రబలసాగెను. ఈ నాగరికత భగవంతునకు, మానవునకు మధ్య పెద్ద యగాధము నేర్పరచెను.

మతములన్నియు నాధ్యాత్మికాదర్శమునందే జనించినవి. కాని మత సంస్థ మతముకన్నను తనకే ప్రాధాన్యమునిచ్చు కొనుటయే తడవుగ నా మతము క్షీణింపసాగును. ప్రజా బలములేనిదే యేసంస్థయు వర్ధిల్లజాలదు. కావున మతము వర్ధిల్లవలెనన్న సామాన్య ప్రజల మతవాంఛల నీడేర్ప వలెను. ప్రజా బలమును జేకూర్చుకొనుటకు ప్రజల నిత్యజీవితావసర వస్తువులను సమకూర్చి యందింపవల యునుగదా! ఇందువలననే మతమునందు విగ్రహారాధన ములు, పూజలు, ఆచారములు తోడు గావింపబడినవి. దాని యాధ్యాత్మిక జ్యోతిని మాత్రము ఋషులు, మహాత్ములు సర్వదా వెలుగొందునట్లు చేయుచునే యుండిరి. కాని సామాన్య ప్రజలలో ననవసరములగు బాహ్య చిహ్నములు ప్రధానములై, నైతికములగు పునా దులు సడలుటచేతనే మతములు పతన మార్గముల బట్టి నవి. నీతి సడలినది. 'నీతియే మతము, ఆధ్యాత్మిక' మను భ్రమ ప్రజలయందు వ్యాప్తమైనది. ప్రతి మతమునం దును నీతియుండుట నిజమే. ఆధ్యాత్మిక వికాసమునకది సాధనమగుటయు నిజమే; కాని దానికంటె నిది వేర యిన దనవచ్చును.

"కొన్ని మానసిక నియమములతో బాహ్య ప్రవర్త నమును శాసించు ప్రయత్నమే నీతి. అనగా మానసి కాద

ర్శములలో మానసిక నియమములను గావించి నడవడిని యేర్పఱచుకొనుటయే నీతి. "తన లోపలను, ఇతరుల లోపలను గల యాత్మను వికసింపజేయుటకు గావింపబడిన ప్రయత్న ఫలమే యాధ్యాత్మికము. ఆత్మసత్యత్వము నందే జీవించి దాని వికాసమునకు కృషి గావించుటయే యాధ్యాత్మికము. బాహ్యాంతరముల కతీతమగుదాని ననుభూతి గావించుటయే యాధ్యాత్మికము. భారత దేశమున మతము వికసించి విజృంభించుటకిదియే పునాదియైనది. వైదిక మతమున విశాల దృక్పథము, సహనశక్తి, సేవా త్యాగములు ప్రబలి మానవ వికాసమున కెక్కుడుగ తోడ్పడినవి. ప్రాచీనర్షులు, యోగులు, సన్యాసులు దీని కంటిపెట్టుకొని యిందే జీవించిరిగాన భారతీయ సంఘము, మతము తన విశాల సందేశమును విశాల ప్రపంచమున వెదజల్లగలిగినది. కాని నేడో! ఆ గుణములు లోపించుట కతననే భారతీయులు పతితులైరి.

పాశ్చాత్యులు రాజకీయాదర్శములద్వారా బాహ్య స్వాతంత్ర్యమును, శాంతిని బడయుటకు కృషి గావించిరి. కాని నేటి ప్రపంచమున నా శాంతిగాని, స్వాతంత్ర్యము గాని యెక్కడ? నేటి పాశ్చాత్య స్వతంత్ర దేశములవారు విజ్ఞానశాస్త్ర శక్తిని, రాజకీయ సైనికబలమును జేకూర్చుకొని యధికార ప్రమత్తులై పరుల దోచుకొనుచున్నారు.

తమ స్వార్థమును, తృష్ణను ప్రబలజేసికొనుచున్నారు. ఈ లక్ష్య సిద్ధికే దేశసంపత్తిని, మానవశక్తిని పూర్తిగ బలిగావించుచున్నారు. ఎటుచూచినను యుద్ధఘోషయే. యుద్ధ భయము లేని కాలమునగూడ సైనిక సంపత్తితో గూడిన శాంతియే. ఇట్టి శాంతి యుద్ధమునే ప్రదర్శించునుగదా! కాన పాశ్చాత్యులు సదా యుద్ధ జీవితమునే గడపుచున్నారు. అధికార ప్రాపకమునకు ప్రాకులాడు దేశములందు స్వాతంత్ర్య మెట్లు వర్ధిల్లగలదు? మరియు యంత్రమూలమున మానవసమస్యల బరిష్కరింప బూనుట మానవ జీవితాభివృద్ధికి, వికాసమున కెట్లు తోడ్పడ గలదు? విశాల హృదయులు, ఉదార స్వభావులు, నీతి మంతులు నగు వారి హస్తగతమగు రాజ్యమునందే స్వాతంత్ర్య శాంతులు వర్ధిల్లగలవు

ప్రాచీన భారతదేశము గ్రామమయమై పరిపూర్ణ ప్రజాపాలనము గలిగియుండెను. కేంద్ర ప్రభుత్వము రాజుల హస్తగతమైనను త్యాగధనులగు ఋషుల సలహాలతో నడపబడెను. ఆధ్యాత్మిక వికాసము సత్ప్రవర్తనకును, స్వార్థ రహిత పరిపాలనమునకును సోపానమయ్యెను. నేటి శాస్త్ర విజ్ఞాన వికాసము భౌతిక వస్తుతత్త్వ విజ్ఞానమును బెంపొందించినది, మానవుని నూతన మానసిక వికాసమును విస్తరింపజేసినది. కాని యీవిశాలవిజ్ఞాన

మును మానవుడు తన స్వార్థముకొఱకు దుర్వినియోగ మొనర్చుకొనుటచే శాస్త్రవిజ్ఞానము మానవ శాంతి, రక్షణలను గాపాడజాలకున్నది. ఇది నైతిక వికాసము నకు దోడ్పడలేదు. విషవాయువులు, మరఫిరంగులు మానవుని వినాశకర పద్ధతులకే యొడ్డినవిగాని మానవాభివృద్ధికి దారి తీయలేకపోయెను. అశాంతి, అసంతృప్తి నేడు ప్రబలినవి. ఈ విపరీత పరిస్థితులందు అసంతృప్తియే యున్నతమార్గమునకు దారితీయవచ్చును. మానవుని యహంకారమే నేటి పతనమునకు కారణము. మతవిధాన మున నిట్టి యహంకారమే ప్రత్యేక సంప్రదాయ ప్రాబల్యమునకు దారి దీసి కలహములకు మార్గదర్శకమాయెను. రాజకీయమున నిరంకుశాధికారమే పరదేశముల స్వాతంత్ర్యమును హరించి దోపిడిని బెంపొందించినది. శాస్త్ర విజ్ఞానమున తన మానసిక వికాస పరిశోధనలే ప్రబల ప్రమాణములని భావించి యితర విద్యాభివృద్ధుల తిరస్కరింపజేసినది. తన భౌతిక దృష్టికి మించినది లేదను నహంకారమే యీ పతనమునకు కారణము.

పాశ్చాత్య భావదాసులకు పాశ్చాత్యు లాదరించిన యీ పాశవిక కృత్యములు స్ఫురించినవి. రక్త ప్రవాహ మూలకములగు విప్లవమార్గములకు దేశమున బీజములు

నాటబడినవి. యుద్ధములే తరణోపాయములుగ నుద్దేశింపబడినవి.

ఈ కారణమువలన భారతదేశము ఒక్క విధముగ కాదు - రాజకీయముగ, ఆర్థికముగ, ధార్మికముగ, సారస్వతికముగ పతనమయినది. ఈపరిస్థితినుండి పునరుద్ధరింపబడుటకు మార్గము లేమా! యని పలువురు పలువిధములుగ నాలోచించినారు.

కాని భారతీయ సంస్కృతి ప్రభావము సామాన్యము గాదు. ఆ సంస్కృతిచ్ఛాయలలో బెరిగినవారి కాయాసురిక కృత్యములు నచ్చలేదు. వారు తమ నాగరికత కనుకూలమైన మార్గములకు తహ తహలాడినారు. ఆ భావ ప్రాబల్యమేగాంధిమహాత్మునిరూపమున ప్రకటమయినది.

సత్యాహింసల ప్రభావము సన్నగిల్లిపోయిన దని చాటుచు వచ్చినవారికి దిగ్భ్రాంతి కలుగునట్లుగ సత్యాగ్రహోద్యమము ఆసేతు హిమాచలము వెల్లివిరిసినది. అది యొక మహాయజ్ఞము. అందపవిత్రతకు తావులేదు. పవిత్రీకరణమే పరమలక్ష్యము. స్వీయ పాశవిక భావములను సత్యాగ్ని హోత్రమునందు వ్రేల్చుటయేగాని పరునిమీద పరకమైన నెత్తరాదు. అంతదాక నేల ? పరపక్షమువాని నెక్కపలుకైనను పల్లెత్తి పలుకరాదు.

భావమునందైనను కట కట పడరాదు. ఇది యసిధారా వ్రతము. ఈ కఠోర వ్రతము నొక్క భారతీయులు మాత్రమే పూని నిర్వహింపగలరు. వార ట్లాయజ్ఞమును సాంగముగ - సమగ్రముగ నెరవేర్ప బూనిరి.

ఇచ్చట నీ యజ్ఞకార్యము సంపన్నమగుచుండగా దీని పవిత్రత కాంగ్లదేశము అట్టుడికిన ట్టుడికిపోయినది. అధికార పిశాచావిష్టములైనవారి హృదయములలో త్యాగ భావము తావుచేసికొన్నది. భారతదేశస్వాతంత్ర్యమునకు వాగ్దానముచేసి తద్రూప సిద్ధికై తగిన సన్నాహములు చేసినారు. ఇది సత్యాహింసల సత్త్వమాహాత్మ్యము.

భారతదేశము స్వారాజ్యమును సంపాదించుకొన్నది. సమాఖ్యరూపమునుగూడ సంతరించుకొన్నది. ఒక్క నెత్తుటి బొట్టునైన చిందనీయక యింతటి మహావిప్లవమును సాధించిన భారతీయ సంస్కృతికి, భారతీయ ప్రతిభకు సర్వ ప్రపంచము జోహారులర్పించుచున్నది. విపరీతనాగరికతలో పుట్టి పెరిగిన విదేశీయులకు ఈ సంస్కృతి లభ్యమగుట సామాన్యముకాదు. అయినను ప్రయత్నించి పాటు పడినచో నలభ్యముమాత్రము గాదు

భారతదేశముపై నిప్పుడొక పెద్దబాధ్యతపడియున్నది. తాను తన సనాతన సంస్కృతీ సంపత్తును సముద్ధరించు

కొనుటయేగాక ప్రపంచమునకంతటికి శాంతిభిక్ష పెట్టవలసిన సమయ మాసన్నమయినది. భయసంభ్రమములతో ప్రతి క్షణమును ప్రాణములు గుప్పిటబట్టుకొనియున్న ప్రపంచమునకు - ఉన్నతాదర్శము లేక కేవల ప్రాపంచిక భోగములకే ప్రాకులాడుచున్న ప్రపంచమునకు - అర్థ సంగ్రహామే పురుషార్థముగ భావించి నానా అకార్యములు చేయుచు, స్పర్ధలతోడి సమర సన్నాహములలో సతమతమగుచున్న ప్రపంచమునకు భారతదేశము కళ్యాణ మార్గమును చూపవలసియున్నది.

భారతజాతి లక్ష్యమును కాళిదాసమహాకవి తన కావ్యములో నొకచోట సూత్రప్రాయముగ నిట్లు వక్కాణించి యున్నాడు.

"శైశవేఽభ్యస్త విద్యానాం యౌవనే విషయైషిణాం ॥
వార్ధకే ముని వృత్తీనాం యోగేనాంతే తనుత్యజాం"

శైశవమునందు తమ జీవితాభివృద్ధి కవసరములగు విద్యలను చక్కగ నేర్వవలయును. యౌవనమునందు ఆర్థిక, రాజకీయాది విషయములను సమకూర్చుకొని యిష్టోపభోగముల ననుభవింపవలయును. ముసలితనమున లౌకికములగు జంజాటములనుండి తొలగి జ్ఞానవృత్తితో మెలగవలయును. అట్లు నిండు నూరువర్షములు సుఖ

ముగా జీవించినపిమ్మట యోగముచే - స్వేచ్ఛందముగా - దేహయాత్రను జాలింపవలయును. ఇది భారతీయుల జీవన క్రమము. ఈ క్రమతత్త్వమునే ధర్మమందురు. "యతోఽభ్యుదయ నిశ్శ్రేయస సిద్ధి స్సధర్మః" ఈ జీవితమునను, జీవితానంతరమునను సుఖసమృద్ధులతో శాంతిపూర్వకముగ జీవించుటయే భారతీయ సందేశము. దీనికి ప్రధాన సాధన విధానము పురుషార్థములు: ధర్మార్థకామమోక్షములు. ఇవి యొక దానికొకటి వ్యతిరేకములు, విఘ్నకరములు గానీక సమన్వయరూపముతో సంతరించుకొనుటయే భారతీయుని విధి. ఈ విధానమునే భారతదేశము ప్రపంచమునకు చేయెత్తి చాటుచున్నది.

జై భారత్



తెనాలి, భారతీ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడెను. 1951.

'సందేశమాల' యితర గ్రంథములు

గా. శ్రీ. చంద్రమౌళిగారిచే రచింపబడిన

## రామాయణ సుధాలహరి

బాల - అయోధ్యా - అరణ్య - కిష్కింధ - సుందరకాండములు

200 పుటలుగల ఒక్కొక్క కాండ వెల రు. 2-0-0

రామాయణ కావ్యమును రకరకములుగా రచియించిన వారు, రచియించుచున్నవారు పెక్కురున్నారు.

కాని యీ పుస్తకములోక యపూర్వమగు ఫక్కీలో, ననన్య సామాన్యమగు భాషలో వ్రాయబడినవి.

ఇందు వాల్మీకి వైశిష్ట్యమును, రామాయణ రామణీయకతను, రసవద్ఘట్టముల యౌచిత్యమును పరామర్శించిన నైపుణ్యమును; ప్రస్తుత కాలమునకు సమన్వయించిన చాకచక్యమును ప్రస్తుతి పాత్రములు.

పత్రికలు, వ్యక్తులు; పండితులు, పామరులు మెచ్చుకొన్న గ్రంథరాజములు.

మచ్చునకు ఆంధ్రలోకమునకు సాహిత్య క్షేత్రమున - ఆచార్య స్వరూపులగు శ్రీ రామలింగారెడ్డిగారి యభిప్రాయము ప్రక్కపుటలో మీరు చూడవచ్చును.

ఆంధ్రలోక మిచ్చిన ప్రోత్సాహము వలన క్రమముగా తక్కిన కాండములును వచ్చి మీ కానందమును గూర్పనున్నవి.

చిక్కని కాగితము, చక్కనిముద్రణము, ముచ్చటైన త్రివర్ణ చిత్రము, ఇతర చిత్రములు.

UNIVERSITY OF MYSORE

C. R. REDDY
*Pro-Chancellor*

WEST LAKE
YELWAL ROAD
MYSORE,
10th May, 1950

*My Dear Chandramouli,*

Really it is the greatest pleasure and, if you won't get offended, a bit of a surprise also, to me:–your presentation of the immortal Ramayana. I congratulate you on your profound scholarship without pedantry, the uniform good taste and the excellent classical style of your Balakanda. I am beginning to think that a first-rate man of letters has been lost in a Politician, though even there he has deserved more or less well of the country, but not so well!

But perhaps I may add that, as an exponent of Higher Criticism, I may not be able to agree with all the views expressed. If you are interested in the principles of my Higher Criticism, please read my preface to the Andhra University Edition of Gona Buddha

Reddy's" Ranganatha Ramayana." The key-note points are brought out there. I had no idea that in spite of your European Education, you were so choke-full of orthodoxy and the సాంప్రదాయిక mode of treating these subjects. But in this wide world, where the sun shines on all alike, there is room for both schools of thought and both types of personality -- and indeed for innumerable more schools of thought and types of personality. Your book will be valued as literature and fist-rate literature at that.

With my cordial congratulations and best wishes,

*Yours sincerely,*
(Sd.) Ç. R. REDDY.

మొదటి పుష్పము

వెల రు. 1-8-0 **సఫలత** 150 పుటలు

ఒకానొక కార్యమును సాధించి సఫలత నొందుట కవసరములగు గుణగణములను సోదాహరణముగా జర్చించి సాఫల్య మార్గమును జూపిన గ్రంథరత్నము.

ఎంత యసమర్థునకును ఉత్సాహము నియగల విషయములు, సరలము రసవంతమునగు భాష. ఆంధ్రమున నిట్టి విషయమును బోధింప బూనిన యేకైక గ్రంథము.

ఆంధ్ర విశ్వకళాపరిషత్తుచే ఇంటర్ మీడియేట్ విద్యార్థులకు కొన్ని యేండ్లపాటు పాఠ్య గ్రంథముగా నిర్ణయింపబడ్డది. ఎల్లరచే ప్రశంసల నందినది.

రెండవ పుష్పము

**'బుకర్ – టి – వాషింగ్టన్'**

వెల రు. 1-0-0 (ఆదర్శ విద్యార్థి) 112 పుటలు

అమెరికాలో అతి దీనదశనుండి యత్యున్నత దశకు వచ్చిన యొక నీగ్రో వాని జీవిత చరిత్రము.

ప్రయత్నించినచో మానవుని కందరాని స్థానము లేదని నిరూపించు మనోహర పుస్తకము.

ప్రతి భారతీయుడు తప్పక చదివి తీరవలసినదని గాంధి మహాత్ముడు మనకు చూపిచన్న చరిత్ర.

మనోహరమగు సులభ శైలి. హైస్కూళ్లలో హైయర్ ఫారములకు ఉపవాచకముగా టెక్ట్సు బుక్కు కమిటీచే నంగీకరింపబడినది.

దొరకుచోటు:— 'సందేశమాల', తెనాలి.